# REWARD!




BRING 10 DIFFERENT WRAPPER STORIES AND THEIR WRAPPERS TO GET 3 MONOPACKS FREE

Big Babol

SOFT NON STICKY BUBBLE GUM

HURRY KIDS!

- Look out for wrapper stories inside Big Babol monopacks only
- Collect the reward from your nearest dealer
- Offer available in select cities

PERFETTI

McCann/PERFETTI/ 895




## అశ్విని హోమియో హెయిర్ ఆయిల్

* జుట్టు రాలిపోవడాన్ని, తెల్లబడటాన్ని అరికడుతుంది.
* జుట్టు ఒత్తుగా, మృదువుగా, ఆరోగ్యంగా పెరిగేందుకు సహకరిస్తుంది.
* జిడ్డులేనిది, మెదడును చల్లబరిచేది.
* మాడు నొప్పిని తగ్గిస్తుంది.




## అశ్విని మజిల్ ఆయిల్

* మోకాళ్ళ నొప్పులు,
* ఒళ్ళు నొప్పులు,
* బెణుకులు,
* కండరాల నొప్పులను నివారించే దివ్యఔషధం.




## అశ్విని హెర్బల్ బాత్ పౌడర్

* స్వేదరంధ్రాలను శుభ్రపరచి, రోజంతా తాజాగా ఉంచుతుంది.
* కండరాల పటిష్టతకు తోడ్పడుతుంది.
* శరీర సహజ సమతౌల్యాన్ని నిలుపుతుంది.
* మీ చర్మాన్ని మృదువుగా ఆరోగ్యంగా వుంచుతుంది.

## అశ్విని హోమియో & ఆయుర్వేదిక్ ప్రోడక్ట్స్ లిమిటెడ్

మూసాపేట్, హైదరాబాద్ - 500 018. ఇండియా.

ఫోన్స్ : 273430, 273607. ఫ్యాక్స్ : 040-272409

ANJU ADS



# చందమామ

జూలై 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు


| | | | |
|---|---|---|---|
| వార్తలు-విశేషాలు | ...9 | ఇందుమతినిర్ణయం | ....37 |
| అత్తగారిశాంతం | ....10 | సందేహనివృత్తి | ....42 |
| హుష్...హుష్! | ....16 | మహాభారతం-14 | ....45 |
| రూపధరుడి యాత్రలు-1 | ....17 | పిసినారితర్కం | ....52 |
| చందమామ కబుర్లు | ....24 | చందమామ అనుబంధం - 81 | ....53 |
| చంద్రశేఖరుడికథ | ....25 | చాటుమాటలు | ....57 |
| మనదేశపు కోటలు-5 (బే.క) | ....33 | హడావుడిమనిషి | ....62 |




విడి ప్రతి : 5.00

సంవత్సర చందా : 60.00





# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి




## విద్యాసంస్థలలో రాజకీయాలు!

నూతన విద్యాసంవత్సరం ఆరంభమయింది. బడులలో కొత్త హడావుడి. విద్యార్థులు నూతనోత్సాహంతో పాఠాలు చదవడం ప్రారంభిస్తారు.

చదువులతో పాటు విద్యార్థులలో సత్ప్రవర్తనను, నాయకత్వ లక్షణాలను పెంపొందించాలన్న మంచి ఆశయంతో ప్రతి తరగతికీ, ప్రతి పాఠశాలకూ లీడర్లను నియమించే పద్ధతి నేటి విద్యావిధానంలో భాగంగా రూపొందించబడింది. విద్యార్థుల సామర్థ్యాన్ని, ప్రవర్తనను అనుసరించి మామూలుగా ఉపాధ్యాయులే విద్యార్థినాయకులను నియమిస్తూఉంటారు. కొన్నిచోట్ల నాయకులకు ఎన్నికలు కూడా జరుపుతారు. ఈ తతంగం కళాశాలలలో మరీ ఆర్భాటంగా జరుగుతుంది. ఈ ఎన్నికలలో పోటీ చేసేవారికి రాజకీయపక్షాల మద్దతు కూడా ఉంటుంది! దాంతో ఈ పద్ధతి ఆశించిన ఫలితాలను ఇవ్వకపోగా, విద్యార్థుల జీవితాలలో అపస్వరాలను వినిపిస్తుంది!



దేశంలో స్వాతంత్ర్యోద్యమం సాగినప్పుడు, విద్యార్థులు పోరాటంలో దిగిన మాట నిజమే. ఆనాటి పరిస్థితి వేరు. ఈనాడు వివిధ రాజకీయ పక్షాలు పుట్టుకువచ్చి, తమ స్వార్థప్రయోజనాలకోసం; తమ పబ్బం గడుపుకోవడానికి విద్యార్థులను రెచ్చగొడుతున్నాయి. ఇది ఏమాత్రం అభిలషణీయంకాదు. చదువుకని వెళ్ళిన తమ పిల్లలు ప్రత్యక్షరాజకీయాలలో పాల్గొనడం ఏ తల్లిదండ్రులూ ఇష్టపడరు. కాలం చాలా విలువయినది. చదువుకునే ప్రాయంలో అది మరీ ప్రాణం వంటిది. అటువంటి అపురూపమైన కాలాన్ని అల్పవిషయాలకు వృథా చేయకూడదు. అందుకు రాజకీయపక్షాల నీలినీడలు విద్యాసంస్థల మీద పడకుండా చూసుకోవడం ఎంతయినా అవసరం!


సంపుటి : 97 జూలై '95 సంచిక : 1

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00







ప్రవేశ పెట్టబడుతున్నాయి అత్యంత నాణ్యమైన కంపాస్ బాక్స్‌లు. సంపూర్ణ నియంత్రణనిస్తూ, అతి నిర్దిష్టంగా, అతి సమర్థవంతంగా రేఖలు గీచేందుకై ప్రత్యేకించి తయారుచేయబడినవి. మీ చిన్నారికి ప్రైమ్ వాడే సదుపాయాన్నివ్వండి.

మీ చిన్నారికి అదెంతో అమూల్యమైనదని మీరే గుర్తిస్తారు.

ప్రైమ్ మెరిట్ | ప్రైమ్ ర్యాంక్ | ప్రైమ్ జీనియస్ | ప్రైమ్ లీడర్

◀ మ్యాథమ్యాటికల్ డ్రాయింగ్ ఇన్‌స్ట్రుమెంట్స్ ▶

PIDILITE PRODUCTS

PID 63 95 TEL

ZEN

వార్తలు - విశేషాలు :

# అట్లాంటిక్ మహాసముద్రంలో మినీ ఇండియా

భారతదేశ అధ్యక్షుడు డా।। శంకర్‌దయాళ్ శర్మ ఇటీవల ప్రత్యేక ఆహ్వానం మీద కరీబియన్ దేశం ట్రినిడాడ్ - టోబాగోకు ముఖ్య అతిథిగా వెళ్ళివచ్చారు. మొట్టమొదట భారతీయులు అక్కడికి చేరి 150 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా ఏర్పాటు చేసిన వేడుకలను పురస్కరించుకుని, భారత అధ్యక్షుణ్ణి ఆహ్వానించారు. మొట్టమొదట మనదేశం నుంచి వెళ్ళిన కొందరు 1845 వ సం।। మే 30వ తేదీ ఆ ప్రాంతంలో అడుగు పెట్టారు.

అమెరికాను కనుగొన్న క్రిస్టఫర్ కొలంబస్ దక్షిణ అమెరికా తూర్పుతీరానికి అవతలవున్న ట్రినిడాడ్ ద్వీపాన్ని 1498వ సం।।లో చేరినట్టు చరిత్ర చెబుతున్నది. ఆతరవాత అది స్పెయిన్ కాలనీ అయింది. 1802వ సం।।లో అది బ్రిటిష్ వశమయింది. బ్రిటన్, ట్రినిడాడ్‌కు సమీపంలో వున్న టోబాగో ద్వీపాన్ని కూడా వశపరచుకున్నది. 1809వ సం।।లో ఈ రెంటినీ ఒకే కాలనీగా కలిపింది.

ఈ రెండు ద్వీపాలలో చెరకు బాగాపండేది. అక్కడ పని చేయడానికి బ్రిటిష్ యజమానులకు కూలీలు కావలసివచ్చారు. ఆ సమయంలో బ్రిటిష్ వాళ్ళు మనదేశాన్ని పాలిస్తున్నారు. కాబట్టి మనదేశం తూర్పు ప్రాంతాలయిన కలకత్తా, చోటా నాగపూర్ ప్రాంతాలనుంచి అక్కడికి కూలీలను తీసుకువెళ్ళడానికి పూనుకున్నారు. కలకత్తా ఓడరేవులో 230మంది భారతీయులను 'ఫేటల్‌రోజక్,' అనే ఓడలోకి ఎక్కించారు. చాలాకాలం ప్రయాణంచేసి, భవిష్యత్తు పట్ల బిక్కుబిక్కుమనే చూపులతోవాళ్ళు — ఇప్పటి రాజధాని పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కు కొద్దిదూరంలో వున్న నెల్సన్ దీవి, కూలీ డిపోలో అడుగు పెట్టారు. ఆ తరవాత 70 సంవత్సరాల వరకు ఉత్తరప్రదేశ్, బీహార్, దక్షిణ ప్రాంతాల నుంచి కూడా కూలీలను అక్కడికి తరలించారు. అదే విధంగా బ్రిటిష్ వాళ్ళు తమ ఆఫ్రికా కాలనీల నుంచి కూడా కూలీలను తీసుకువెళ్ళారు.

ట్రినిడాడ్, టోబాగోలు కలుపుకుంటే ఈనాడు అక్కడ 20,00,000 మంది జనాభా ఉన్నారు. వారిలో భారతీయ సంతతి వారూ, ఆఫ్రికా సంతతి వారూ దాదాపు సరిసమానంగా ఉన్నారు.

అక్కడవున్న భారతీయ సంతతివారు ఇంకా తమ పూర్వుల జన్మస్థానాన్ని మరిచిపోలేదు. వాళ్ళు తమతో తమ బట్టలనే కాకుండా వేషభాషలనూ, ఆహార పద్ధతులనూ, మత సంప్రదాయాలనూ, ఆచార వ్యవహారాలనూ కూడా తీసుకువెళ్ళారు.అక్కడ హిందీ, బెంగాలీ, పంజాబీలతో పాటు మన నాలుగు దక్షిణాది భాషలు మాట్లాడేవాళ్ళుకూడాఉన్నారు. భోజ్‌పురి, మైథిలి, సంథాలి, నేపాళీ భాషలు మాట్లాడే వాళ్ళుకూడా ఉన్నారు. అక్కడి ఊళ్ళకు మధుర, లక్నో, కాన్పూర్, చందర్‌నాగూర్, మద్రాస్, మలబార్ ల్యాండ్స్, ఢిల్లీరోడ్, గోల్కొండ మొదలైన పేర్లు పెట్టుకున్నారు.

మనదేశం నుంచి మొట్టమొదట ట్రినిడాడ్‌కు చేరుకున్నవారి సంతతివాడైన నూర్‌హసనాలీ, "సముద్రాలు మనల్ని వేరు చేసినప్పటికీ, మన హృదయాలు మాత్రం దగ్గరగానే ఉన్నాయి,"అన్నారు.భారత అధ్యక్షుడు ట్రినిడాడ్ టోబాగోలను — మనసూ, మనసూ కలసిన భారత దేశం! అన్నారు.






గౌరీపురంలోని రామజోగయ్య, బాగా ఆస్తి పాస్తులున్నవాడు. అతడికి ఇద్దరు కొడుకులు; కేశవుడు, మాధవుడు. ఇద్దరూ మంచి పని మంతులేకాక బుద్ధిమంతులు కూడా. అయినా, రామజోగయ్యకు చెప్పుకోదగినంత మనశ్శాంతి వుండేది కాదు. దానికి కారణం, అతడి భార్య శాంతమ్మ నోటివాటుతనం.

ఏమీ లేనిదానికి నాలుగు మాటలూ, కాస్త వున్నదానికి నలభై మాటలూ, గురితప్పని వాడి బాణాల్లా విసరగలగటం శాంతమ్మ ప్రత్యేకత. భార్య నోటిదురుసుతనం ఎరిగిన రామజోగయ్య, పెద్దకొడుకు కేశవుడికి తన బావమరిది ధర్మయ్య కూతురు కమలను తెచ్చి చేశాడు. రక్తసంబంధం గనక, తన భార్య కాస్త విసురుతనం చూపించినా, అత్తా కోడళ్ళిద్దరూ సఖ్యంగా కలిసి వుంటారని అతడు ఆశించాడు. అయితే, చీటికీ, మాటికీ ఏదో రకంగా సాధించే మేనత్తపోరు పడలేక కమల, వేరు కాపురం పెడితేనే మళ్ళీ వస్తానని చెప్పి, పుట్టింటికి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత వారం రోజులకు వియ్యంకులు ధర్మయ్యా, రామజోగయ్యా సంప్రతించుకుని, తమ పిల్లలు వేరు కాపురం వుండటంలోనే సుఖం వుందని నిశ్చయించారు. ఆవిధంగా, రామజోగయ్య పెద్దకొడుకు కేశవుడు ఉన్న ఊళ్ళోనే వేరు కాపురం పెట్టుకున్నాడు. అతడికిప్పుడు ఏడాది వయసువాడైన ఒక కొడుకు.

రామజోగయ్య, ఉన్న ఒక్కగానొక్క మనవడితో హాయిగా కాలక్షేపం చెయ్యలేకపోతున్నానని బాధపడుతూండేవాడు. ఈ పరిస్థితుల్లో అతడికి చిన్నకొడుకు మాధవుడికి పెళ్ళి చెయ్యటమంటే భయం పట్టుకున్నది.

ఇలా వుండగా — ఒకరోజున రామజోగయ్య, పొరుగూరు రామాపురంలో వుండే మిత్రుడు నారాయణయ్యను చూడటానికి

"లలిత-శర్మిల"

వెళ్ళాడు. నారాయణయ్య ఆస్తిపాస్తుల విష యంలో, రామజోగయ్యతో సరితూగలేకపో యినా, చెప్పుకోదగ్గ స్థితిమంతుడే.

చాలాకాలానికి తన ఇంటికొచ్చిన మిత్రుణ్ణి చూసి ఎంతో సంతోషించిన నారాయణయ్య, రామజోగయ్యను కుశల ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి చేసి, విందుభోజనం తయారు చెయ్య వలసిందిగా భార్యకు చెప్పి వచ్చాడు.

తర్వాత, స్నేహితులిద్దరూ మండువా లోగిలిలో వున్న విశాలమైన ఉయ్యాలబల్ల మీద కూర్చుని, తీరిగ్గా పిచ్చాపాటీ ప్రారం భించారు.

అలా కొద్దిసేపు గడిచేసరికి, పనివాడి చేత మూట మోయించుకుంటూ, ఒక వ్యక్తి వచ్చి, నారాయణయ్యతో, "అయ్యా, అమ్మాయిగారు కలనేత జరీచీరలు తెమ్మని క్రిందటిసారి నేను వచ్చినప్పుడు మరీ మరీ చెప్పారు. అందుకని ఆమెకోసం ఖేషైన రకాలు పట్టుకు వచ్చాను," అన్నాడు.

నారాయణయ్య, "అమ్మా, విమలా!" అంటూ కేక వేశాడు.

విమల లోపలి గదుల్లోంచి మండువా లోగిలిలోకి రాగానే, వ్యాపారి వినయంగా ఆమెతో, "అమ్మా, తమరు క్రిందటిసారి అడిగారే — దోసెడు జరీ అంచున్న కలనేత చీరలు, వాటిని తెచ్చాను," అంటూ పనివాడి వైపు తిరిగి, "మూట విప్పి, అమ్మాయిగారి కోసం తెచ్చిన చీరలు తియ్యి!" అన్నాడు.



పనివాడు చప్పున మూట విప్పబోయాడు. విమల వాణ్ణి విప్పవద్దని సైగచేసి, వ్యాపారితో, "ఒక్క క్షణం ఆగండి వరాలయ్యగారూ! ఇప్పుడే వస్తాను," అంటూ లోపలికి వెళ్ళింది.

తర్వాత ఆమె కొద్దిసేపట్లోనే, వెలిసిపోయి పాతదానిలా కనిపిస్తున్న చీర ఒకటి తీసుకుని, వరాలయ్య దగ్గరకు వచ్చి, "ఇదేమిటో ఒక్క సారి చూడండి!" అన్నది.

ఆ చీరను చూస్తూనే వరాలయ్య మొహం వెలవెలబోయింది. అయితే క్షణంలో సర్దు కుని, "నాసిరకం చీరె! ఎవరిదగ్గర కొన్నారు?" అని ప్రశ్నించాడు.

విమల చిన్నగా నవ్వి, "మీ దగ్గరే కొన్నా నని చెబితే ఆశ్చర్యపోతారేమో!" అన్నది.



వరాలయ్య ఆమె మాటల్ని తేలిగ్గా తీసి పారేస్తూ, "అమ్మాయిగారు వేళాకోళం చేస్తు న్నారు! ఈ వరాలయ్య ఇటువంటి నాసిరకాలు అమ్మనే అమ్మడు," అన్నాడు.

ఆ జవాబుకు విమల గంభీరంగా, "వరా లయ్యగారూ, క్రిందటిసారివచ్చినప్పుడు, ఇటు వంటి తీపికబుర్లు చెప్పే, ఈ చీరెను నాకు భారీవెలకు అంటగట్టారు. ఒక్కసారి ఉతికే సరికి చీర ఇలా తయారయింది. మోసం ఒకేసారే ఫలిస్తే, నిజాయితీ జీవితాంతం ఫలిస్తూనే వుంటుందని గుర్తుంచుకోండి! ఇక వెళ్ళిరండి!" అన్నది.

విమల మాటలకు వరాలయ్య వెలతెలా బోతూ, ఏదో చెప్పబోయాడు. కానీ, విమల, అతడికి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా, "వరాలయ్యగారూ, భగవంతుడు మనిషికి మాట ఇచ్చింది, మంచితనాన్ని మాటల ద్వారా వ్యక్తం చేయటానికి! అంతేగాని, వాచా లతతోనో, నోటి దురుసుతనంతోనో పనులు సాధించుకుని, తెలివిమంతులమని మురిసి పోవడానికి కాదు! మీరింకేమీ చెప్పనవసరం లేదు. వెళ్ళిరండి," అన్నది.

విమల మాటలకు ముఖం ముడుచుకున్న వరాలయ్య, ఇంకేమీ మాట్లాడలేక, మౌనంగా పనివాడి చేత చీరలు మూట కట్టించి, లేచి వెళ్ళిపోయాడు.

అప్పటివరకూ జరిగినదంతా చూస్తున్న రామజోగయ్య, విమలతో, "అమ్మా, అంత పెద్దవాడితో అంత నిక్కచ్చిగా మాట్లాడావు గదా, నీకు భయంగాని, జంకుగాని కలగ లేదా?" అని ప్రశ్నించాడు.

విమల నవ్వుతూ, "మనలో ఏ తప్పూ లేనప్పుడు భయమూ, జంకూ ఎందుకు? నిర్దోషి అనవసరంగా భయపడితే, దోషి దాన్ని ఆసరాగా తీసుకుని మరింత హద్దుమీరి ప్రవ ర్తిస్తాడు!" అన్నది.

రామజోగయ్య ఆమె మాటలు వింటూ సాలోచనగా తల ఊపాడు.

ఆ తర్వాత, సాయంత్రం తిరిగి వెళ్ళే సమయం దాకా, మిత్రుడితో మాట్లాడుతున్నా, ఏదో తీవ్రంగా ఆలోచిస్తూనే వున్నాడు రామ జోగయ్య.

చివరికి, బయల్దేరేముందు, ఒక నిశ్చయా నికి వచ్చినట్టు, "నారాయణా, నిన్నొక కోరిక కోరాలని వున్నదయ్యా!" అన్నాడు.

నారాయణయ్యఆశ్చర్యంగా,"దానికి సందే హమెందుకు, రామజోగా? నువ్వు అడగటమూ నేను కాదనటమూ కలలో మాట. నువ్వు కోరరానిదేదో కోరవని నాకు తెలుసు! నీ కోరిక సంతోషంగా తీరుస్తాను, అడుగు!" అన్నాడు.

"మరేమీ లేదు. నీ కూతురు విమలను మా ఇంటి కోడలుగా తీసుకుపోవాలని నా కోరిక!" అన్నాడు రామజోగయ్య.

ఆమాటవింటూనేనారాయణయ్య,మిత్రుణ్ణి కౌగిలించుకుని, "రామజోగా, నాకు వరమి స్తూనే కోరిక అంటావేమయ్యా? నీ కోడలు కావటమంటే, అది కేవలం నా కూతురి అదృష్టం!" అన్నాడు.

రామజోగయ్య నవ్వి, "నేను ఇంటికి వెళ్ళగానే, మావాళ్ళకు విషయమంతా చెప్పి, త్వరలోనే పెళ్ళిచూపులు ఏర్పాటు చేస్తాను. నువ్వు కూడా చెల్లెమ్మకూ, విమలకూ చెప్పి వుంచు," అన్నాడు.

ఇల్లు చేరగానే రామజోగయ్య తన రెండవ కొడుకు మాధవుడికి, తను ఏర్పాటుచేసిన పెళ్ళి సంబంధం గురించి చెప్పి, "బాబూ, మీ వదిన కాస్త మెత్తనిది. అందుచేత మీ అమ్మదే పైచెయ్యి అయి, వాళ్ళు వేరే కాపురం పెట్టవలసి వచ్చింది. నీ భార్య కాస్త చురు



కైనదీ, మాటకారీ అయితే, మీ అమ్మకే ఇంత బుద్ధి చెప్పగలదని, నా ఆశ! విమల ప్రవర్తన నా ఆశకు నీరు పోసింది. ఆమె పుణ్యమా అని నీ అన్నా, వదినలు తిరిగి మనింటికి వస్తారని నమ్మకంగా వుంది," అన్నాడు.

తర్వాత జరిగిన పెళ్ళిచూపుల్లో విమల, మాధవుడికీ; నారాయణయ్య ముట్టజెబుతా నన్న కట్నకానుకలు శాంతమ్మకూ బాగా నచ్చ టంచేత, అతిత్వరలోనే విమలా మాధవుల వివాహం జరిగి, విమల కాపురానికొచ్చింది.

కాపురానికి వచ్చిన తొలిరోజుల్లోనే, పిల్లినీ, ఎలుకనూ కూడా సాధించే అత్తగారి స్వభావాన్ని విమల బాగా గ్రాహ్యం చేసుకున్నది. అయితే,



తప్పు తనది కాకపోయినప్పటికీ అత్తగారు తరుచు విసురుతున్న సూటీపోటీ మాటలకు, విమల పల్లెత్తు మాట కూడా ఎదురాడకుండా, అత్యంత సహనంగా ప్రవర్తించటం రామ జోగయ్యకు చాలా ఆశ్చర్యంగా తోచింది. కొత్త కోడలు కదా, కాస్త పాతబడితే తనే నోరు విప్పుతుందని సరిపెట్టుకుని, దాదాపు సంవ త్సరందాకా ఎదురుచూశాడు. అయినప్పటికీ శాంతమ్మ విసురుతనమూ, విమలసహనమూ అదే మాదిరిగా వుండటంతో, చివరికి ఒక నాడు భార్య గుడికి వెళ్ళగా చూసి కోడలి దగ్గర ఈ ప్రస్తావన తెచ్చాడు.

"అమ్మా, నువ్వు కాపురానికి వచ్చినప్పటి నుంచీ చూస్తున్నాను, మీ అత్తగారు నిన్ను అన్యాయంగా సాధిస్తున్నది. అయినా నువ్వు నోరు విప్పకపోవటం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. ఆనాడు చీరలవ్యాపారితో అంత నిక్క చ్చిగా మాట్లాడిన పిల్లవు నువ్వేనా అన్న అను మానం కలుగుతున్నది," అన్నాడు.

మామగారి మాటలకు విమల చిరునవ్వు నవ్వి, "ఆనాడు నేను వ్యాపారితో అంత నిష్కర్షగా మాట్లాడానంటే, దానికి కారణం మా ఇద్దరికీ ఎటువంటి అనుబంధమూ లేకపోవటమే, మామయ్యా! ఇక్కడ నన్ను నిందిస్తున్న వ్యక్తి, స్వయానా నా భర్తకు తల్లి. ఆమెతో మాకున్న అనుబంధం నన్ను బాధిస్తుంది. అనుబంధాలు కావాలని అను కున్న చోట, శాంతమూ సహనమేగాని ఘర్షణ పనికిరాదు," అన్నది.

కోడలి మంచితనానికి రామజోగయ్య కళ్ళు చెమర్చాయి. ఆయన ఎంతో ఆప్యా యంగా, "అమ్మా, వయసుకు చిన్నదానివైనా, ముదివగ్గుకు కూడా బుద్ధి వచ్చేలా మాట్లా డావు. కానీ, నీ మంచితనం నీ అత్తగారి దృష్టిలో పిరికితనమై, నిన్ను మరింత చులకన చేసే అవకాశమున్నది. అప్పుడు నీ సహనానికీ అంతం రాగలదు. ఆరోజు రాకుండానే, నువ్వు మీ అత్తగారికి బుద్ధి చెబుతావేమో అని ఆశ పడ్డాను. కాని, మూర్ఖత్వం బరిలోకి దిగినంత సులువుగా వివేకం దిగదని అర్థమైంది. ఏం చేస్తాం, మా తలరాత ఎలా వుంటే అలా జరుగుతుంది. ఇంతటి సుగుణశీలిని కోరి

కోడల్ని చేసుకుని, బాధలు పడుతూంటే చూస్తూ వూరుకోవలసి వస్తున్నది!" అంటూ, ఇక ఇంట్లో వుండబుద్ధి కానట్టు కండువా భుజాన వేసుకుని వీధిలోకి బయలుదేరాడు.

అతడు బైటికి వెళుతూండగా, శాంతమ్మ గుడి నుంచి తిరిగివచ్చి, ఇంట్లోకి వస్తూ ఎదురైంది. భార్య మొహం చూడటానికి కూడా ఇష్టం లేనివాడిలా తల పక్కకు తిప్పుకుని వెళ్ళిపోయాడు, రామజోగయ్య.

ఆనాటి రాత్రి భోజనాల దగ్గర, కోడలి మీద ఏమీ విసుక్కోకుండా ముభావంగా వున్న శాంతమ్మ ఉన్నట్టుండిరామజోగయ్యతో, "రేపు మంచిది! తిథీ, నక్షత్రం బాగున్నవి. మీకుకాస్తతీరుబాటుదొరుకుతుందా?" అన్నది.

రామజోగయ్య ఏమీ పట్టించుకోనట్టు, "దేనికీ?" అన్నాడు విసుగ్గా.

శాంతమ్మ తల వంచుకుంటూ, "మనిద్దరంవెళ్ళి పెద్దబ్బాయినీ, కోడల్నీ, మనవణ్ణీ తీసుకురావటానికి," అన్నది.

భార్య మాట వింటూనే రామజోగయ్య ఆశ్చర్యపోతూ, "ఏమిటేమిటీ?" అన్నాడు.

శాంతమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ, "ఇవ్వాళ గుడిలో హరికథ లేదు. వెంటనే తిరిగివచ్చి, లోపలికి రాబోతూ మీరూ, విమలా మాట్లాడుకుంటున్న మాటలన్నీ విన్నాను. ఇంతకాలంగా నా మాటతీరు వల్ల అయిన వాళ్ళ మనసులో అసహ్యాన్ని సంపాదించు కుంటున్నానని గ్రహించలేకపోయాను. విమల చెప్పినట్టు, అనుబంధాలూ, ఆప్యాయతలూ కావాలంటే, ముందు మనిషి ప్రవర్తన ఆత్మీయంగా వుండాలి," అన్నది.

ఊహించలేని విధంగా భార్యలో వచ్చిన మార్పుకు రామజోగయ్య ఎంతో ఆనందిస్తూ, "ఇన్నాళ్ళకు ప్రశాంత జీవనానికి మూలసూత్రం ఏమిటో గ్రహించగలిగావు! అత్తగారి శాంతం కుటుంబ సౌఖ్యానికి దేవుడిచ్చిన వరంలాంటిది," అన్నాడు.

"అవును! ఇంత స్వల్ప విషయాన్ని, మన పెద్ద కోడలు కాపురానికి వచ్చిన రోజునే చెబితే సరిపోయేది కదా? ఇంతకాలం ఎందు కూరుకున్నారు?" అంటూ శాంతమ్మ పెద్దగా నవ్వింది.



# హుష్... హుష్!

పెనుతుఫానులో చిక్కుకుని, తామున్న ఓడ మునిగిపోతూండగా, ముగ్గురు వ్యక్తులు ఒక కొయ్యబల్ల సాయంతో, కొంతసేపటికి ఎవరూ నివసించని ఒక దీవిని చేరుకున్నారు. ఆ దీవిలో ఎన్నో ఫలవృక్షాలు, ఒక చిన్న నది, ఆ నదిలో లెక్కలేనన్ని చేపలున్నాయి. వాటిని తింటూ, కాలక్షేపానికి జూదం ఆడుతూ ఆ ముగ్గురూ దీవిలో నివసించసాగారు.

ఈ ముగ్గురిలో ఒకడు గ్రామపెద్ద, రెండోవాడు రైతు, మూడోవాడు వట్టి తిరుగుబోతు.

ఒకనాడు ముగ్గురూ సముద్రపుటొడ్డున నడుస్తూండగా, గ్రామపెద్దకు ఇసుకలో ఒకసీసా కనిపించింది. రైతు దానిని చేతిలోకి తీసుకున్నాడు. తిరుగుబోతు దానికున్న మూతను ఊడలాగాడు. ఆ వెంటనే ఎంతో కాలంగా సీసాలో వున్న భూతం, "ఆహాఁ" అని ఫెళ ఫెళ నవ్వుతూ బయటికి దూకింది.

ఇదిచూసి ముగ్గురూ పారిపోబోయారు. కాని, భూతం వాళ్ళను ఆగమని, "నన్ను సీసాలోంచి విడిపించినందుకుగాను, మీ కోరికలు తీరుస్తాను. ముగ్గురూ ఒక్కొక్క కోరిక మనసులోనే అనుకోండి," అన్నది.

"గ్రామస్థుల తగాదాలు తీర్చి తీర్పునివ్వడానికి, నేను తక్షణం మా గ్రామం చేరాలి!" అనుకున్నాడు గ్రామపెద్ద మనసులో.

వెంటనే భూతం, "హుష్!" అన్నది. గ్రామపెద్ద మాయమయ్యాడు.

"పంట కోతకు వచ్చి వుంటుంది. నేను నా పొలం దగ్గర వుండాలి," అన్నాడు రైతు.

"హుష్!" అన్నది భూతం ఈసారి రైతు మాయమయ్యాడు.

"నాతో రోజూ జూదం ఆడేందుకు, వాళ్ళిద్దరూ ఇక్కడే వుండిపోతే ఎంత బావుణ్ణు!" అనుకున్నాడు తిరుగుబోతు.

"హుష్!హుష్!" అన్నది భూతం.

ముగ్గురూ ఎప్పటిలా సముద్రం ఒడ్డున వున్నారు. భూతం మాత్రం మాయమైంది.

— రామవరపు గణేశ్వరరావు






[ట్రోయ్ నగరపు రాజైన వర్ధనుడి కుమారుడు మోహనుడు, ప్రతాపుడనే గ్రీకురాజు భార్య భువనసుందరిని ఎత్తుకుపోవటమూ; భువనసుందరిని తిరిగి తెచ్చుకునే నిమిత్తం గ్రీకులు నౌకలలో బయలుదేరి, ట్రోయ్ నగరాన్ని ముట్టడించి, పదేళ్ళయుద్ధం అనంతరం కొయ్య గుర్రం సహాయంతో ట్రోయ్‌నగరంలో ప్రవేశించి, నగరాన్ని తగలబెట్టటమూ, "భువనసుందరి" అనే గ్రీకు పురాణగాథలో చదివాం.

ట్రోయ్‌పైకి దండెత్తి వెళ్ళిన గ్రీకు వీరులలో ఒకడైన రూపధరుడు, యుద్ధానికి బయలుదేరబోయే సమయంలోనే, మరి ఇరవై సంవత్సరాల దాకా ఇంటికి తిరిగిరాడని జోస్యం చెప్పారు. ఈ ఇరవై సంవత్సరాలలో పదిసంవత్సరాలు ట్రోయ్ ముట్టడిలోనే గడి చాయి. మరి పది సంవత్సరాలపాటు రూపధరుడు అతి విచిత్రమైన అనుభవాలకు గురి అయ్యాడు. ఈ అనుభవాలను చిత్రించే కథ ఈ సంచిక నుంచి ప్రారంభమవుతున్నది.]

రూపధరుడి నౌకలు ట్రోయ్‌తీరాన్ని వదల గానే ఎదురుగాలి సాగింది. నౌకలు దక్షిణ దిక్కుగా ప్రయాణించటానికి మారుగా ఉత్తరం గావెళ్లి ఇస్మరోస్ తీరాన్ని తాకాయి. ఇది కికో నియనులుండే నగరం.

రూపధరుడి బలాలు నగరం మీద పడి దోచి, నగరాన్ని ధ్వసం చేసేశాయి. సైనికులు నగరంలోని స్త్రీలనూ, పశువులనూ, సంప దలనూ పంచుకున్నారు. "మనం ఎంత త్వరగా బయలుదేరి వెళ్ళిపోతే అంత మంచిది!" అని రూపధరుడు చెప్పాడు. కాని సైనికులు అతని మాటలు వినే స్థితిలో లేరు. ఎందు చేతనంటే వారికి నగరంలో అంతులేని వింత పానం దొరికింది. అందరూ తప్పతాగి, సముద్ర



పోయిన గ్రీకుల సంఖ్య నౌకకు ఆరుగురు చొప్పున ఉన్నది. మిగిలినవారు ఆలస్యం కాకుండా తమ నౌకలలో దూకి ప్రాణాలు రక్షించుకున్నారు.

వారు సముద్రంమీద కొద్దిదూరం వెళ్ళేసరికల్లా వాయవ్యదిశ నుంచి ఝంఝూ మారుతంసాగింది. భూమివైపు నుంచీ, సముద్రం వైపు నుంచీ కూడా నీలిమేఘాలు వచ్చి ఆకాశాన్ని ఆవరించాయి. రాత్రి ముంచుకు వచ్చింది. ఆ హోరుగాలికి తెరచాపలు ఉబ్బి పడవలు వాయువేగాన కొట్టుకుపోసాగాయి.

త్వరలోనే తెరచాపలు గాలి తాకిడికి తట్టుకోలేక చినిగి చీలికలైపోయాయి.

ఎవరి ప్రాణాలూ దక్కవని రూపధరుడికి భయం పట్టుకున్నది. అన్ని నౌకల తెరచాపలూ దించేసి, తెడ్లు వేస్తూ తీరాన్ని చేర్చమని అతను తన సైనికులకు చెప్పాడు. నౌకలు తీరాన్ని చేరాక రెండు రోజులపాటు గ్రీకులు తమ ప్రాణాలను అరచేతబట్టి తుఫాను నిలుపుదలకోసం ఎంతగానో ఎదురుచూశారు. ఆ రెండు రోజులూ వారు సూర్యకాంతి చూసి ఎరగరు.

చివరకు మూడోనాటి ఉదయం తూర్పున అరుణోదయం కనిపించేసరికి మళ్ళీప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది. వారు మళ్ళీ తెరచాప స్తంభాలు ఎత్తి, కొత్త తెరచాపలు ఏర్పాటు చేశారు. ఆ తరవాత వారి ప్రమేయం ఏమీ

తీరాన జంతువులను చంపి, కాల్చి, విందు చేసే ప్రయత్నంలో ఉండిపోయారు.

ఈలోపుగా నగరంనుంచి తప్పించుకుని పారిపోయిన కికోనియనులు ఇతర గ్రామాలకు వెళ్లి అసంఖ్యాకులైన యోధులను వెంట బెట్టుకు వచ్చారు. ఇలా వచ్చిన వారిలో రథాల మీద నిలబడీ, అవసరమైతే కిందదిగీ సాహసంతో యుద్ధం చెయ్యగలవారు అనేక మంది ఉన్నారు.

తెల్లవారుజామున ఈకికోనియనుయోధులు మిడతల దండులాగా వచ్చి రూపధరుడి సైనికులపై పడ్డారు. ఘోరమైన యుద్ధం జరిగింది. కికోనియనుల సంఖ్య హెచ్చు. పొద్దెక్కుతున్న కొద్దీ రూపధరుడి బలాలు తగ్గసాగాయి. చచ్చి

లేకుండానే నౌకలు గాలివాలున వేగంగా పోసాగాయి.

నాలుగు రోజులు ఈ విధంగా ప్రయాణం చేసి రూపధరుడి నౌకలు మలియా అగ్రాన్ని చేరుకున్నాయి. ఈ అగ్రాన్ని చుట్టి ఉత్తరంగా వెళితే రూపధరుడు తన స్వదేశమైన ఇథాకాను చేరవచ్చు. గాలి ఉధృతం కొంచెం తగ్గినట్టు కనబడింది. నౌకలు అగ్రాన్ని చుట్టి ముందుకు సాగవలసిందిగా రూపధరుడు ఆజ్ఞ ఇచ్చాడు. కాని అంతలోనే మళ్ళీ ఝంఝామారుతం సాగి, నౌకలను కితీరా వైపుకు వేగంగా తీసుకు పోయింది. తొమ్మిది రాత్రులూ, తొమ్మిది పగళ్ళూ రూపధరుడి నౌకలను వాయుదేవుడు బంతి ఆడాడు. పదవ రోజున వారు ఒక తీరాన్ని తాకారు. కాని రూపధరుడు ఈ తీరాన ఎక్కువకాలం తన నౌకలతో నిలిచే అవకాశం లేకపోయింది.

ఎందుచేతనంటే, ఈతీరాన ఉండే ప్రజలు ఒక రకం పళ్లు తింటారు. అవి తేనెరుచిగా ఉంటాయి. వాటిలో గింజలుగాని, టెంకలు గాని ఉండవు. అవి తింటే మనుషులకు పాత విషయాలేవీ జ్ఞాపకం వుండవు; నల్ల మందు తిన్నవాళ్లలాగా తన్మయత్వంలో నిమగ్నులవుతారు.

కాని ఈ సంగతి రూపధరుడికి తెలియదు. అతనూ, అతని అనుచరులూ తీరాన వంట చేసుకు తిన్నారు. తరవాత రూపధరుడు తనవాళ్ళను ముగ్గురిని పిలిచి, "ఈ తీరాన



ఎలాటి మనుషులుంటారో చూసి రండి!" అని పంపాడు.

ఈ ముగ్గురు గ్రీకులకూ అక్కడి ప్రజలు అపకారమేమీ చేయకపోగా తాము తినే ఫలాలను వారికి కూడా ఇచ్చారు. అవి తినగానే రూపధరుడి మనుషులు తాము వచ్చిన పని పూర్తిగా మరచిపోయి పరమానందంలో మునిగిపోయారు.

ఎంతసేపటికీ తన మనుషులు తిరిగిరాక పోయేసరికి వారిని వెతుక్కుంటూ రూపధరుడు, మరికొందరిని వెంటబెట్టుకుని వచ్చి జరిగిన సంగతి తెలుసుకున్నాడు. అక్కడి ప్రజలు అతనికి కూడా పళ్ళు తినమని ఇచ్చారుకాని, రూపధరుడు వాటిని శంకించి



తినలేదు. వాటిని తినిన తన మనుషులను అతను బలాత్కారంగా నౌకల వద్దకు తీసుకు రావలసి వచ్చింది. అప్పటికీ వారు, "మేము నీతో రాము. ఇక్కడే ఉంటాము! మమ్మల్ని వదిలెయ్యి! ఇక్కడే మాకు బాగున్నది!" అన్నారు.

రూపధరుడు వారిని తాళ్ళతో కట్టి నౌకలలో పడవేయించి, తాను ఇక ఆ తీరాన ఒక్క క్షణం ఉన్నా ప్రమాదమేనని గ్రహించి నౌకలను ముందుకు నడిపించాడు. ఈ నౌకలు కొన్ని రోజులు సముద్రం మీద ప్రయాణించి, తలవని తలంపుగా ఒక రాత్రి ఏదో తీరాన్ని చేరాయి. తాము ఎటువంటి ప్రదేశం చేరినదీ గ్రీకులు ఎరగరు. ఎందుచేతనంటే ఆకాశాన చంద్రుడున్నప్పటికీ మేఘాలు దట్టంగా ఉన్నాయి. అదీగాక సముద్రం మీద పొగ మంచు దట్టంగా వుండటంమూలాన అంత దూరంలో ఏమున్నదీ తెలియరాలేదు. మిగిలిన విషయాలు తెల్లవారి చూసుకోవచ్చునని, గ్రీకులు తెరచాపలు దించి, తమ నౌకలలో నుంచి తీరానికి వచ్చి, ఇసుకలో పడుకుని మైమరచి నిద్రపోయారు.

వారు తెల్లవారుతూనే లేచి, దీవిలాగా కనబడే ఆ ప్రదేశమంతా తిరిగి, అక్కడి ప్రకృతి సౌందర్యం చూసి అనేకరకాలుగా ముచ్చటపడసాగారు.

ఆ దీవిలో అన్ని రకాల ఫలవృక్షాలూ సమృద్ధిగా ఉన్నాయి,అంతులేనిద్రాక్ష తీగలున్నాయి.నేలచాలాసారవంతమైనది,కాని ఎక్కడావ్యవసాయంలేదు.అయితే జలసమృద్ధికి ఏమాత్రమూ లోటులేదు. అందుచేత వ్యవసాయం అవసరం లేకుండానే ఆ భూమిమీద అన్ని రకాల ధాన్యాలు పండించవచ్చు.

గ్రీకులు తమ నౌకలను వదిలి ఎంతో దూరం వెళ్ళకమునుపే వారికి అడవిమేకలు కనబడ్డాయి. వారు వెంటనే తమ నౌకలవద్దకు పరిగెత్తి విల్లులూ,అంబులూ, ఈటెలూ తెచ్చుకున్నారు. వాటితో కొన్ని మేకలను చంపి వండుకుని రోజల్లా తింటూనే వున్నారు. ఎందుకంటే రూపధరుడి వెంటవున్న పన్నెండు నౌకలలో ఒక్కొక్క నౌక వంతూ తొమ్మిదేసి మేకలు చొప్పున వచ్చాయి.

అ రోజు వారు నౌకలను విడిచి వెళ్లక పోయినా,దూరాన మనుషుల నివాసాలున్న లక్షణాలు వారికి కనిపించాయి. సాయంకాలం పూట వారికి అక్కడక్కడా వంటఇళ్ల తాలూకు పొగ కనిపించింది; దూరాన మేకలూ, గొర్రెలూ అరుస్తూ వున్న చప్పుడు స్పష్టంగా వినిపించింది.

రూపధరుడు తూర్పు తెల్లవారుతూనే తన మనుషులను పిలిచి, వారితో ఇలా చెప్పాడు: "నేను నా పడవను నడుపుకుని ఈ తీరం వెంబడి వెళ్లి ఈ దీవిలో ఉండే మనుషులు నాగరికులో, అడవిజాతివాళ్లో, వాళ్లకు ఒక సమాజం ఉందో లేదో చూసి వస్తాను.ఆతరవాతఏంచేయాలో ఆలోచిద్దాం. నేను తిరిగివచ్చేదాకా మిగిలిన పడవలూ, మిగిలిన మనుషులూ ఇక్కడే కదలకుండా ఉండండి!"

రూపధరుడి నౌక కొంతదూరం తీరం వెంబడే వెళ్లేసరికి ఒకచోట తీరానికి కొంత ఎడంలో ఒక ఎత్తయిన దిబ్బమీద ఒక గుహ కనిపించింది. దానిమీదుగా లతలు పెనవేసుకుని ఉన్నాయి. దానిచుట్టూ పెద్దప్రహరీ గోడలాటిది ఉన్నది. ఇందులో పెద్ద పెద్ద కొండరాళ్లూ, బ్రహ్మాండమైన చెట్లబోదెలూ ఉన్నాయి.

రూపధరుడు తన నౌకను గుహకు ఎదురుగా నిలిపి, తన నావికులలో పన్నెండు మందిని, ధైర్యసాహసాలు గలవారిని ఏరుకుని, ఒక మేకతోలు తిత్తిలో వింత పానీయం తీసుకుని గుహకేసి బయలుదేరాడు.





ఈపానీయంఅపురూపమైనది. రూపధరుడు ఇస్మరోస్‌పై దాడి చేసినప్పుడు అక్కడ ఉండే ఒక అర్చకుణ్ణీ, అతని భార్యాబిడ్డలనూ చంపక వదిలివేశాడు. అందుకు ప్రతిఫలంగా ఆ అర్చకుడు రూపధరుడికి అనేక తిత్తులలో అద్భుతమైన సారాయినీ, వెండి బంగారాలనూ బహూకరించాడు. ఆఅర్చకుడు ఈ పానీయాన్ని ఇరవై రెట్లు నీటిలో కలిపి తాగేవాడట. అప్పటికీ దాని మాధుర్యమూ, సువాసనా చెప్పనలవి కాకుండా ఉండేదట.

రూపధరుడూ, అతని అనుచరులూ త్వరలోనే గుహకు చేరుకున్నారు. కాని గుహలో ఎవరూ లేరు. అదిచాలాపెద్దగుహ. అందులో అనేక అలవలు కట్టి ఉన్నాయి. వాటి నిండా గొర్రెపిల్లలూ మేకపిల్లలూ వయసు వారీగా ఉన్నాయి. ఒక పక్క పాలమీగడ అచ్చులు పేర్చి ఉన్నాయి. అనేక భగోణీల నిండా పాలు ఉన్నాయి.

"ఈ మీగడ అచ్చులు పట్టుకుని మన దారిన మనం పోదాం!" అన్నారు రూపధరుడి అనుచరులు.

"మనని అడ్డేవారు లేరు; ఈ గొర్రెపిల్లల్నీ, మేకపిల్లల్నీ తోలుకుపోదాం!" అన్నారు మరి కొందరు.

కాని రూపధరుడు సమ్మతించ లేదు. అందరూ తినగలిగినంత జున్ను తిన్నారు. తరవాత ఆ గుహలో ఉండే మనిషి కోసం ఎదురు చూడసాగారు.

చివరకు ఆ మనిషి రానేవచ్చాడు. మొదట అతన్ని గ్రీకులు చూడలేదు, పెళపెళారావంతో ఏదో వచ్చి గుహలో పడింది. అది ఒక ఎండు మానుల కట్ట! తరవాత అసలు మనిషి వంగి గుహలోకి వచ్చాడు. పిల్లిని చూసిన ఎలుకల్లా గ్రీకులు చెల్లా చెదరుగా పారిపోయి దాక్కున్నారు.

ఆ వచ్చిన మనిషి తాటిచెట్టు ఎత్తున్నాడు. అతని నుదుట ఒకే ఒక కన్ను నిప్పుకణికలా మెరుస్తున్నది.

ఈ మనిషి ఒక పెద్ద గొర్రెలమందను గుహలోకి తోలాడు. ఆ గొర్రెలు బాగా కొవ్వి ఉన్నాయి. తరవాత ఒక బ్రహ్మాండమైన బండరాయిని ఎత్తి గుహకు అడ్డంగా వేశాడు.

ఇరవై జతల ఎద్దులు తోసినా కదలనంత పెద్దరాయి అది. ఆ తరవాత వాడు ఆడ గొర్రెలన్నిటికీ పాలు తీశాడు.

ఈ మనిషి ఫాలలోచనుడనే జాతివాడు. ఈ జాతికి చెందినవాళ్లు అనేకమంది ఈ ప్రాంతంలో ఉన్నారు. వీరికి సామాజిక జీవితంలేదు. ఎవరి కష్టసుఖాలు వారివి. విసిరి పారేసినట్టు ఒక్కొక్కరూ ఒక్కొక్క గుహలో ఉంటారు. ఒకరిని గురించి ఒకరు ఏమాత్రం పట్టించుకోరు.

ఈఫాలలోచనులు వ్యవసాయంచెయ్యరు. అక్కడి నేల చాలా సారవంతమైనది కావటం చేత వ్యవసాయం లేకుండానే బార్లీ, గోధుమలు మొదలైన ఆహార ధాన్యాలు సమృద్ధిగా పండుతాయి.

ఈ రాక్షసులు ఏడాదికొకసారి ధాన్యం కోసుకువస్తారు. మిగతా సమయాలలో బీళ్ల మీదికి గొర్రెలనూ, మేకలనూ తోలుకుపోయి రోజల్లా మేపుతారు. బలమైన పచ్చిక తిని ఆ జంతువులు బాగా కొవ్వుతాయి. కావలసినంత పాలిస్తాయి. పొద్దస్తమానం వాటిని కాయటం తప్ప ఈ ఫాలలోచనులకింకేమీ చేతకాదు.

ఈ రాక్షసులు అనేక తరాలుగా సముద్ర తీరాన ఉంటున్నప్పటికీ వారికి చిన్నచిన్న పడవలునిర్మించటంగాని,తామున్నచోటునువదిలి సముద్రయానాలు చేయటంగాని ఏమాత్రం చేతకాదు.అందుచేత వారు నాగరికత కొంచెమైనా తెలియక కేవలందుర్భరజీవితంగడుపుతున్నారు.

గ్రీకులు ప్రవేశించిన గుహలో ఉండే ఫాలలోచనుడుతానుపితికినపాలలోసగభాగం జున్నుచేసి, బుట్టలో పెట్టుకున్నాడు. మిగిలిన పాలను తాగటానికి కాబోలు భగోణీలలో పోశాడు.

తరవాత వాడు పొయ్యిలో నిప్పురాజేశాడు. ఆ మంటలలో వాడి ఒంటికంటికి గ్రీకులు కనిపించారు.

ఆ రాక్షసుడు తన కంటిని అతి భయంకరంగా అటూ ఇటూ తిప్పుతూ, వెనక్కుతిరిగి, "ఎవరు మీరు?" అని గుహ దద్దరిల్లేలాగా అరిచాడు. - (ఇంకాఉంది)



## చందమామ కబుర్లు

### కవలపిల్లల సామర్థ్యం!

కేరళరాష్ట్రం ఎర్నాకుళంలో ఒకే కాన్పులో పుట్టిన మహేష్, మనోజ్, మాయా అనే ముగ్గురు కవల పిల్లలు ఈ సంవత్సరం జరిగిన ఎస్.ఎస్. ఎల్.సి. పరీక్షలు రాసి ముగ్గురూ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. మగపిల్లలిద్దరూ డిస్టింక్షన్



సాధించారు. వాళ్ళ తల్లి, స్టేటిస్టిక్స్ ప్రొఫెసర్, తండ్రి, అకౌంట్స్ ఆఫీసర్!

### అంతరిక్షంలో అమెరికా రికార్డు

అంతరిక్షంలో 85 రోజులు గడిపి అమెరికా వ్యోమగామి నార్మన్‌థాగార్డ్ జూన్ 6వ తేదీ కొత్త రికార్డు సృష్టించాడు. అంతకు ముందు వెళ్ళిన అమెరికా వ్యోమగామి 84 రోజులు 1 గంట 16 నిమిషాలు అంతరిక్షంలో గడిపివచ్చాడు. అంతరిక్షంలో గడపడానికి వెళ్ళే వాళ్ళందరూ అక్కడ రష్యా నెలకొల్పిన 'మీర్' అనే స్పేస్‌స్టేషన్‌లోనే దిగాలి.నార్మన్‌థాగార్డ్‌అక్కడజూలైవరకుఉంటాడు. ఆ తరవాత మరొక వ్యోమగామి వెళ్ళాక, అతన్ని భూమికి తీసుకువస్తారు.ఎవరు వెళ్ళినాసరే అక్కడ 439రోజులు గడిపి గత మార్చిలో తిరిగివచ్చిన రష్యా వ్యోమగామి వాలేరీ పోలియాకోవ్ రికార్డును అధిగమించడం కష్టం!

### వడ్రంగి పిట్టల ముక్కు పదును!

పదునైన పొడవాటి ముక్కుతో చెట్ల బెరడులను పొడిచి, అందులోని క్రిమికీటకాలను పట్టి తింటాయి వడ్రంగిపిట్టలు. ఆ పిట్టలు చెట్లను అలా పొడవడం వల్లే వాటికి వడ్రంగి పిట్టలనే పేరువచ్చింది. మామూలుగా ఇవి మరే వస్తువుల జోలికీ పోవు. అయితే, ఇటీవల అమెరికాలో రెండు వడ్రంగిపిట్టలు, కెన్నెడీ స్పేస్ సెంటర్‌లో ఉన్న వ్యోమనౌక ఇంధనం ట్యాంకు మీది పై తొడుగును తొలవడం ప్రారంభించాయి. అవి రెండూ కలిసి 10 సెం.మీ. వెడల్పుతో కొన్ని రంధ్రాలు చేశాయి. ఆ కారణంగా అధికారులు వ్యోమనౌక ప్రయోగాన్ని వాయిదా వేశారు. ఆ తరవాత పరిశీలించి చూసినప్పుడు ఆ పిట్టలు, 'లాంఛ్ ప్యాడ్'లోనే గూడు కట్టాయని తెలియవచ్చింది !

### గాయపడిన 'సూపర్‌మేన్'

'కామిక్స్' పుస్తకాలలో వచ్చే సూపర్‌మేన్ కథలు తెలియని పిల్లలంటూ ఉండరు. ఆ కథలనుఉత్సాహంగాచదువుతారు.సినిమాలలో, అజేయుడైన ఆ సూపర్‌మేన్ పాత్రను పోషించిన క్రిస్టఫర్ రీవ్ గత మే నెల ఆఖరు వారంలో ఒక యాక్సిడెంటుకు గురయ్యాడు. గుర్రంపై స్వారీ చేస్తూ ప్రమాదవశాత్తు కిందపడటంతో ఆయన మెడ విరిగింది. ఇప్పుడాయన గండం నుంచి బయటపడ్డాడు.త్వరలోకోలుకోగలడనిడాక్టర్లుచెబుతున్నారు.






# చంద్రశేఖరుడికథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, అంతఃపురాన సుఖ నిద్రలో వుండవలసిన నువ్వు, ఈ అర్ధరాత్రివేళ శ్మశానంలో ఇంతగా శ్రమిస్తూండడం చూస్తుంటే, నీది గొప్పతనమని అనుకోవాలో, అవివేకమని అనుకోవాలో అర్థం కావడం లేదు. సాధారణ ప్రజల దృష్టిలో చాలా గొప్ప వారుగా కనిపించే వ్యక్తులు కూడా, ఒక్కొక్క సారి చాలా అవివేకంగా, మూర్ఖంగా ప్రవర్తిస్తుం టారు. ఇందుకు ఉదాహరణగా, ఒక కవీ - రాజూ గురించి చెబుతాను, శ్రమ తెలియ కుండా, విను," అంటూ ఇలాచెప్పసాగాడు:

పూర్వం కౌశాంబీ దేశంలోని ఒక మారు మూల గ్రామంలో చంద్రశేఖరుడనే యువకు డుండే వాడు. అతడు శాస్త్రాలన్నిటినీ అధ్యయ

## బేతాళ కథలు



నంచేసినవాడు కానప్పటికీ,ఏవిషయం మీద నైనా చక్కటి ఆశుకవిత్వం చెప్పగలిగే వాడు.

చంద్రశేఖరుడు ఒక పేద బ్రాహ్మణుడి కొడుకు. అతడి కవిత్వంవిన్న చాలామంది, అతణ్ణి కౌశాంబీ రాజైన విజయ భూపతి దగ్గ రకు వెళ్ళమనీ, అక్కడ తప్పక రాజాశ్రయం దొరుకుతుందనీ సలహా ఇచ్చారు.

అయితే, కౌశాంబీ రాజ్యంలో ఒక ఆచారం వున్నది. అదేమంటే — కౌశాంబీలో గల ఏ కళాకారుడైనా సరే, మొదట తనకు సమీపంలో వున్న ఏ జమీందారునో ఆశ్రయిస్తాడు. ఆ జమీందారు దివాణంలో కొన్నాళ్ళున్న తర్వాత, ఆయా వ్యక్తుల సామర్థ్యాన్ని బట్టి, ఆయనే వారిని రాజు వద్దకు పంపుతాడు.

చంద్రశేఖరుడికి, తరతరాలుగా వస్తున్న ఆ ఆచారాన్ని ఉల్లంఘించి, తిన్నగా రాజు దగ్గరకు వెళ్ళబుద్ధి కాలేదు. అందుచేత అతడు, తనకు సమీపంలో వున్న చక్రధరపుర జమీం దారు వీరవర్ధనుణ్ణి ఆశ్రయించడానికి నిశ్చ యించుకుని, తండ్రి నిర్ణయించిన సుముహూ ర్తంలో అక్కడికి బయలుదేరాడు.

చంద్రశేఖరుడు వీరవర్ధనుడి భవంతి చేరే సరికి, అక్కడ అంతా గగ్గోలుగా వున్నది. ఇది చూసి నివ్వెరపోతూ, అక్కడున్నవారిని సంగ తేమిటని చంద్రశేఖరుడు అడిగాడు.

వీరవర్ధనుడి ఏకైక కుమార్తెకు నెలక్రితమే పెళ్ళయింది. భార్యతో సహా ఇంకా అత్తవారిం టనే వున్న కొత్తపెళ్ళికొడుకు, ఆనాటి ఉద యాన తోటలో తిరుగుతూ, పాముకాటుకు గురై మరణించాడు. అదీ సంగతి!

సరిగ్గా తాను ఇంటినుంచి బయలుదేరిన సుముహూర్తమే, ఇక్కడ నూతనవరుని మరణ ముహూర్తమైందని విన్న చంద్రశేఖరుడికి, అక్కడ క్షణకాలం కూడా నిలువబుద్ధి కాలేదు. వెనుదిరిగి స్వగ్రామానికి తిరిగివచ్చాడు.

"నేను పెట్టిన ముహూర్తం నీకు అచ్చిరా లేదు!" అంటూ బాధపడ్డ చంద్రశేఖరుడి తండ్రి, ఒక వారం గడిచాక, సమీరపుర జమీం దారు వల్లభరాయుడి దగ్గరకు వెళ్ళడానికి, తన స్నేహితుడి చేత ముహూర్తం పెట్టించాడు.

తీరా శేఖరుడు అక్కడికి వెళ్ళేసరికి, వల్లభ రాయుడికి గత మధ్యాహ్నమే ఏదో తీవ్రమైన

అస్వస్థత చేసిందనీ, జబ్బు ఏమిటన్నది అంతు బట్టక ఘనవైద్యులు కూడా తికమకపడుతు న్నారనీ తెలియవచ్చింది.

ఈసారి కూడా తన ప్రయత్నం విఫలమై పోవడంతో, శేఖరుడు అంతులేని నిరుత్సాహం, నిస్పృహలకు లోనయ్యాడు. అతడు ఇంటికి తిరుగు ప్రయాణమై, దారిలో కనిపించిన ఒక కొలను నీటితో దాహం తీర్చుకుని, కొలను గట్టున వున్న ఒక పెద్ద మర్రి చెట్టు కింద చతికిల బడ్డాడు.

అలా కొద్ది సేపు గడిచేసరికి, ఆ దారిన వెళుతున్న మరొక బాటసారి, కొలను చూసి ఆగి, దాహం తీర్చుకుని వచ్చాడు. శేఖరుడు ఆ బాటసారి రాకను గమనించలేదు.

తిరిగి తన దారిన తాను పోబోతున్న బాట సారి, శేఖరుడి ముఖంలోని విచారాన్ని గమ నించి, అప్రయత్నంగా ఆగి, "అయ్యా, తమ రెవరో తెలుసుకోవచ్చునా?" అంటూ మృదు వుగా ప్రశ్నించాడు.

ఆప్రశ్నతో ఆలోచనల్లోంచి తేరుకుంటూ శేఖరుడు, "తెలుసుకోదగినంత గొప్పవాణ్ణి కాదు!ఒక దురదృష్ట జాతకుణ్ణి,"అంటూనిర్లి ప్తంగా జవాబిచ్చాడు.

ఆ జవాబుకు కాస్త ఆశ్చర్యపడ్డ బాటసారి, ఈసారి శేఖరుణ్ణి మరింత పరీక్షగా చూసి, "సరస్వతీ మానసపుత్రులు, తమది దురదృష్ట జాతకం ఎన్నటికీ కాబోదు! ఏదీ మీ కుడి చెయ్యి ఇలా ఇవ్వండి!" అంటూ తాను



అతడి పక్కనే కూర్చుని, చనువుగా శేఖరుడి కుడి చెయ్యి అందుకున్నాడు.

శేఖరుడి అరచేతిలో రేఖల్ని నిశితంగా పరిశీలిస్తూ, మధ్యలో కొన్ని ప్రశ్నలు కూడా వేసిన బాటసారి, చివరకు ఎంతో ఆత్మీయంగా, "మూడు మాసాల వరకూ, మీరు ఎక్కడికీ కదలకండి. తరవాత, రాబోయే మాఘశుద్ధ పంచమి నాడు మీ ఊరుకు తూర్పు దిశగా ప్రయాణం చేసి, మొట్టమొదట తటస్థపడే జమీందారును ఆశ్రయించండి. మీకు అంతా శుభమే జరుగుతుంది!" అని, లేచి బైలుదేరి, శేఖరుడు చూస్తూండగానే కనుమరుగయ్యాడు.

ఒంటరిగా మిగిలిన శేఖరుడు, తనకు కలిగిన ఆశ్చర్యంలోంచి తేరుకుని, నెమ్మదిగా



స్వీకరించి ఉసూరుమంటూ తిరిగి వచ్చిన కవుల గురించి, శేఖరుడు విని వున్నాడు. తిక్కబుద్ధితోబాటు నరసింహవర్మకు శాస్త్ర పరిజ్ఞానమూ, రసికత్వమూ కూడా అంతంత మాత్రమే.

ఇల్లు చేరిన తర్వాత తండ్రితో కలిసి, బాటసారి పెట్టిన మూడు మాసాల గడువూ తీరేదాకా దీర్ఘంగా ఆలోచించిన శేఖరుడు, చివరకు భగవంతుడి మీద భారంవేసి, బాట సారి చెప్పిన ముహూర్తంలో నరసింహవర్మ దగ్గరకు బయలుదేరాడు.

శేఖరుడు వచ్చిన పని విన్న నరసింహ వర్మ దివాను, "ఈరోజు జమీందారు గారి తండ్రి తిథి. ఆయన ఆ పనిలో ఉన్నారు. సాయంత్రందాకా ఎవరినీ కలుసుకోరు," అని చెప్పాడు.

ఆ మాటలు విన్న శేఖరుడికి, నిరాశతో బాటు రెట్టింపు పట్టుదల కూడా కలిగింది.

అతడు దివానును, "అయ్యా, సాయంత్రం వరకూ ఇక్కడే వేచి వుంటాను. సాయంత్రం మాత్రం జమీందారుగారు దయచేసి నా కవిత్వం వినేలా చూడండి," అని వేడుకు న్నాడు.

శేఖరుడి ముఖంలోని దైన్యాన్నీ, ఆ దైన్యం వెనక, మసిపూసిన మాణిక్యంలా వున్న తేజ స్సునూ గమనించిన దివాను, తను తప్పక సాయం చేస్తానని హామీ ఇచ్చి, అతడికి అతిథి గృహంలో భోజనానికి ఏర్పాటు చేశాడు.

లేచి, బాటసారి జోస్యం గురించీ తన భావి జీవితం గురించీ ఆలోచిస్తూ నడక ప్రారం భించాడు.

తూర్పు దిశగా శేఖరుడి గ్రామానికి చాలా దగ్గరలో వున్న జమీందారు, నరసింహవర్మ! అతడుంటున్న కుగ్రామం కూడా ఆయన జమీలోనిదే!

నరసింహవర్మ వయసులో బాగా పెద్ద వాడు. ఐదుగురు భార్యలున్న నరసింహవర్మ తిక్కబుద్ధిని గురించి కథలు జమీ అంతటా ప్రచారంలో వున్నవి. అతడికి అత్యంత రస భరితమైన కవిత్వం వినిపించి, ఆ క్షణాన అతడి బుద్ధి పెడతిరిగి వున్న కారణంగా, తాంబూలంలో ఒక్క దమ్మిడీ మాత్రం దక్షిణగా

సాయంత్రం అయింది. శేఖరుడికి జమీం దారు దర్శనం మాత్రం కాలేదు.

చివరకు చీకటి పడుతూండగా దివాను వచ్చి, "అయ్యా, మీ గురించి జమీందారు గారికి చెప్పాను. ఈరోజు ఆయన తండ్రిగారి తిథి కదా! 'మా తండ్రిగారికి కవిత్వం అంటే చాలా యిష్టం. ఆయన తిథినాడు కవినంటూ ఆశ్రయం కోరి వచ్చినవాడు, ఒట్టి శుంఠ అయినా మాకు గౌరవనీయుడే! ఈనాటినుంచి అతడు మన ఆస్థానకవుల్లో ఒకడైనాడని చెప్పు. అతడికి వెయ్యిన్నూటపదహార్లూ, పట్టు బట్టలూ ఇచ్చి, సబహుమానంగా గుర్రపు బండిలో పంపు. రేపటినుంచి రోజూ సాయం త్రాలు వచ్చి, మమ్మల్ని తన కవిత్వంతో ఆహ్లాదపరచాలని, మా మాటగా చెప్పు!' అన్నారు. ఆ ఏర్పాట్లు చేసేసరికి కాస్త ఆలస్య మైంది. ఇవిగో, వెయ్యిన్నూట పదహార్లు! ఇవి జరీఅంచు పట్టుపంచెలు. బైట తమ కోసం గుర్రబ్బండి సిద్ధంగా వున్నది," అన్నాడు.

అదంతా విన్న శేఖరుడికి, క్షణకాలం నవ్వాలో, దుఃఖపడాలో తెలియలేదు. చేసే దేమీ లేక, అతడు ఆ బహుమానాన్ని తీసు కుని, జమీందారుగారికి వందనశతాలంద జేయవలసిందిగా దివానుకు చెప్పి, నీరసంగా గుర్రబ్బండి ఎక్కి తిరుగుముఖం పట్టాడు.

ఆతర్వాత శేఖరుడు దాదాపు సంవత్సరం పాటు, నరసింహవర్మ ఆస్థానకవిగా వున్నాడు. వృద్ధజమీందారు వద్ద కేవలం డబ్బుకోసమే



ఆశ్రయించి బ్రతుకుతున్న బూటకపు కవుల సమక్షంలో ఏమాత్రం మనశ్శాంతి లేకపోగా, రాను రాను కవిత్వం అంటేనే ఆసక్తి నశించ సాగింది.

ఇటువంటి పరిస్థితుల్లో, శేఖరుడు ఒక నాడు, ఏదో కారణంగా బండివాడు రాకపోవ డంవల్ల, తన గ్రామం నుంచి పద్మనాభపురా నికి కాలినడకన బయలుదేరాడు. ఎండా కాలం కావడంతో కొద్ది దూరం నడిచేసరికి దాహం వేసి, మార్గమధ్యంలో గల ఒక కొలను దగ్గర ఆగాడు.

ఆసరికే కొలను గట్టుపైనున్న ఒక చెట్టు కింద, తలపాగా ధరించిన బాటసారి ఒకడు విశ్రాంతిగా కూర్చుని వున్నాడు. కొంచెం



దూరంలో మేలుజాతి అశ్వం ఒకటి పచ్చిక మేస్తున్నది.

శేఖరుడు దాహం తీర్చుకుని వస్తుండగా ఆ బాటసారి శేఖరుణ్ణి చూసి పలకరింపుగా మందహాసం చేశాడు. శేఖరుడు కూడా చిన్నగా మందహాసం చేసి, అతడికి సమీపంలో కూర్చున్నాడు.

"అయ్యా, మీరెవరో తెలుసుకోవచ్చునా?" అని బాటసారి చిన్నగా నవ్వుతూ, శేఖరుణ్ణి ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వినగానే శేఖరుడికి గతంలో తనకు జోస్యం చెప్పిన బాటసారి అదే ప్రశ్న వెయ్యగా, 'ఒక దురదృష్టవంతుణ్ణి' అని తను జవాబివ్వడం గుర్తు వచ్చింది.

వెంటనే అతడు, "నేనొక మానవుణ్ణి! అదృష్ట దేవత నా తల్లి, దురదృష్టదేవత నా తండ్రి!" అంటూ జవాబిచ్చాడు.

ఆ జవాబు విన్న బాటసారి ఆశ్చర్యంగా, "అదేమిటి?" అని ప్రశ్నించాడు.

శేఖరుడు మృదువుగా, "క్షమించండి! ఏదో అనాలోచితంగా మాట్లాడాను. ఇప్పుడు, మీ ప్రశ్నకు జవాబుగా ఒక చిన్న కవిత్వం చెబుతాను, వినండి!" అంటూ ఆశువుగా, భావయుక్తమైన కవిత్వం చెప్పాడు.

దాని సారాంశం ఇది : పున్నమి వెన్నెల్లో, ఒక ఉద్యానవనంలోని పుష్పాలు సువాసనలు వెదజల్లుతున్నవి. ఆ సువాసనలకు ఆకర్షింపబడుతున్న గండుతుమ్మెదలు, పువ్వులలోని మకరందాన్ని తృప్తిగా తాగుతున్నవి. ఆ సమయంలో అతిలోక సౌందర్యవతి అయిన ఒక యువతి, ఆ పుష్పాల మధ్య విషాద వదనంతో కూర్చుని వున్నది. ఇది గమనించిన పువ్వులు, "ఏమమ్మా, ఇంత ఆహ్లాదకరమైన వాతావరణంలో, ఒక్కరోజులో వాడిపోయే మేమే ఇంత ఆనందంగా వుంటే, వాడని కుసుమం లాంటి నీ ముఖకమలంలో ఆ విషాదమేమిటి?" అని ప్రశ్నించాయి.

దానికి ఆ యువతి, "నిజమే, నేను వన్నె తరగని పుష్పాన్నే! కానీ, నా చుట్టూ వున్నవి నన్ను ఆనందపరిచే తుమ్మెదలు కావు; గాలికి అటూ ఇటూ కదులుతున్నప్పుడు నన్ను బాధిస్తున్న ముళ్ళు!" అని జవాబిచ్చింది.

కవిత్వం చెప్పిన శేఖరుడు, బాటసారితో, "ఆ యువతి నాలోని కవితా కన్య. ఆమెను నా గుండెల్లో దాచుకున్న దురదృష్టవంతు ణ్ణయి, నా కుటుంబాన్ని పోషించుకోగలుగు తున్న అదృష్టవంతుణ్ణి! ఇక వివరాలు అడ క్కండి. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. వెళ్ళి వస్తాను, శెలవు!" అంటూ బాటసారికి చేతులు జోడించి నమస్కరించి, లేచి మెల్లగా బయలు దేరాడు.



ఆతర్వాత, వారం తిరక్కుండానే ఒకనాటి ఉదయాన, శేఖరుడి ఇంటి ముందు రాజ లాంఛనాలతో జోడుగుర్రాల బండి ఒకటి వచ్చి ఆగింది. అశ్వారూఢులై బండి వెంటనే వచ్చిన ఇద్దరు భటులు, శేఖరుణ్ణి కలుసుకుని, అతణ్ణి రాజలాంఛనాలతో తీసుకురావలసిం దిగా మహారాజు విజయభూపతి యిచ్చిన ఆజ్ఞాపత్రం చూపించారు.

వెంటనే శేఖరుడికి, వారం క్రితం కొలను గట్టున తాను కలుసుకున్నది మహారాజునే అని అర్థమయింది.

శేఖరుడు రాజప్రాసాదం చేరగానే మహా రాజు, అతడికి ఎదురువచ్చి ఆప్యాయంగా కౌగిలించుకుని, "యువకవీ! ఇకనుంచి ప్రతి నిత్యమూ, మీకవితా మాధుర్యాన్ని నాకు పంచే భారం మీదే!" అన్నాడు.

"అంతకంటే అదృష్టం ఏమున్నది, ప్రభూ! అయితే, ఒక్క మాట. నేను నరసింహవర్మ గారి ఆస్థానకవిని. నాకు జీవితాన్ని ప్రసాదిం చిన వ్యక్తి ఆయన. ఆయనకు చెప్పి, ఆయన అనుమతిని తీసుకున్న తర్వాతనే, నేను మీ దగ్గరకు రాగలను," అన్నాడు శేఖరుడు వినయంగా.

మహారాజు ఆదరణకు శేఖరుడి కళ్ళనుంచి ఆనందబాష్పాలు జలజలా రాలాయి.

శేఖరుడి మాటలకు మెచ్చుకోలుగా చూసిన విజయభూపతి, "మధురకవితా చాతుర్యంతో బాటు, మృదువైన జన్మసంస్కారం కూడా మీ సొత్తని అనాడే గ్రహించాను. మీ ఇష్ట ప్రకారమే కానివ్వండి!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మంచి కవి అయిన చంద్రశేఖరుడికి మనశ్శాంతితో కూడిన చక్కటి జీవితాన్ని ప్రసాదించిన వ్యక్తి

మహారాజు విజయభూపతి. నరసింహవర్మ వద్ద అతడి జీవితం ముళ్ళ మధ్య గులాబీలాగా గడిచింది. అందుచేత అతడు జీవనదాత అంటూ ప్రశంసించదలచుకుంటే మహా రాజును ప్రశంసించి, ఆ కృతజ్ఞత ఆయనపట్ల చూపాలి. కానీ, అందుకు విరుద్ధంగా వున్న శేఖరుడి ప్రవర్తన అవివేకంగానూ, మూర్ఖం గానూ లేదా? ఆ అవివేకాన్నీ, మూర్ఖత్వాన్నీ జన్మసంస్కారమంటూ ప్రశంసించిన మహా రాజు ప్రవర్తన మాత్రం ఏమంత న్యాయంగా వున్నది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపో తుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మనిషి జీవితం కళ కంటే ముందుగా భుక్తితో పెనవేసుకుని ఉన్నది. ఆ కారణం వల్ల, శేఖరుడి కుటుంబా నికి అన్నదాత అయిన నరసింహవర్మ, అతడి జీవనదాత కిందే లెక్క. పోతే, అరసి కత్వం నరసింహవర్మ స్వభావం. దాన్ని గురించి ప్రస్తావించడమంటే, అతడిలోని లోపాన్ని వేలెత్తి చూపడమే! అటువంటి కుసంస్కారం శేఖరుడిలో లేదు. అందుకే అతడు, తన మనసులోని బాధకొద్దీ కవిత్వరూపేణా తన పరిస్థితి చెప్పుకున్నా, నరసింహవర్మ పేరును మాత్రం మొదటినుంచీ బైటికి రానివ్వలేదు. అందువల్లనే మహారాజు — మృదువైన జన్మ సంస్కారం కూడా మీ సొత్తని, ఆనాడే గ్రహిం చాను, అని ప్రశంసించాడు. అది మహారాజు గొప్పతనం. పోతే, మహారాజు ఆదరణకు, ఆయన తన పట్ల ప్రవర్తించిన తీరుకు శేఖరుడు మనసారా రాల్చిన ఆనందబాష్పాలే అతడు మహారాజుకు సమర్పించిన కృతజ్ఞ తాంజలులు, ప్రశంసా వాక్యాలు! ఏ కవితా త్మకమైన శబ్దమూ వాటిని మించి కృతజ్ఞతను గాని, ప్రశంసనుగాని ప్రకటించబోదు. అందు చేత, శేఖరుడు, విజయభూపతి ఇద్దరూ మేధావులూ, ఉత్తములేగాని, మూర్ఖులూ అవి వేకులూ ఎంతమాత్రమూ కాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : "సరస్వతీప్రకాశ్" రచన]



# శివాజీ కోటలు

రచన : మీరా ఉగ్రా ◆ చిత్రాలు : అరిత్రా



నైరుతి భారతదేశంలోని కోటలకూ, మహారాష్ట్రనాయకుడు వీర శివాజీ జీవితానికీ, ఆయన కాలానికీ విడదీయరాని సంబంధం ఉన్నది.

ఆయన శివనేర్ అనే పురాతన శాతవాహన కోటలో 1630వ సం|| ఫిబ్రవరి 19వ తేదీ జన్మించాడు.

శివాజీ వశపరచుకున్న మొట్ట మొదటి కోట తోర్నా. ఏమాత్రం రక్త పాతం లేకుండా దానిని ఆయన 1646వ సం||లో ఆక్రమించాడు. అది వర్షాకాలం కావడంతో బిజాపూర్ రక్షణ సేనలు కోట కాపలాకు అక్కడలేవు. శివాజీ ఆ కోటలో దాచిన నిధులను తవ్వి వెలుపలికి తీసి, అక్కడికి 9 కి.మీ. దూరంలో రాజ్‌ఘడ్ అనే కొత్త కోటను నిర్మించడానికి ఆ ద్రవ్యాన్ని ఉపయోగించాడు. రాజ్‌ఘడ్‌కోటనుంచే శివాజీ ఇరవైయేళ్ళు పరిపాలించాడు.

శివాజీ 1647వ సం||లో కొండానా కోటను జయించాడు గానీ, పురందర్ ఒడంబడిక ప్రకారం దానిని మొగలులకు వదిలివేశాడు.

తోర్నాకోట



రాజ్‌ఘడ్‌కోట బురుజులు

కొండానా కోటను మళ్ళీ పట్టుకోవడానికి 1670వ సం॥ ఫిబ్రవరిలో తానాజీ మాలుసారే నాయకత్వంలో అతని తమ్ముడు సూర్యాజీతోపాటు 600 మంది మవాలీ సైనికులను పంపాడు. నిటారుగా ఉన్న కోట పడమటి గోడను ఎక్కడానికి తానాజీ 'యశ్వంతి' అనే ఒక ఉడుమును ఉపయోగించాడని చెబుతారు. ఒక కొసలో కొక్కెంగల మోకును 'యశ్వంతి' నడుముకు కట్టి దానిని కోట గోడ మీదికి పంపించి, అది కోట మీదికి చేరగానే, బరువు తక్కువగా ఉన్న ఒక సైనికుడు ఆ మోకును పట్టుకుని పైకి ఎగబ్రాకి మోకు కొసను అక్కడ గట్టిగా బిగించిన తరవాత, తానాజీతో పాటు దాదాపు 300 మంది సైనికులు కోటమీదికి చేరారు. కోటను పట్టుకున్నారు కాని శత్రువులతో కలిసి వెయ్యిమందికి పైగా మరణించారు. తానాజీ కూడా ప్రాణాలు కోల్పోయాడు. విజయ వార్తను విన్న శివాజీ, "ఘడ్ ఆలా, పాన్‌సింగ్ గేలా", (కోట దక్కింది కాని నా సింహం పోయింది) అన్నాడు. కొండానా కోటకు ఆ కారణంగా సింఘాఘడ్ అనే పేరు వచ్చింది.


తానాజీ మాలుసారే



సామ్రాజ్యం విస్తరించడంతో, శివాజీకి పెద్ద రాజధాని కావలసి వచ్చి, రైరీకోటను ఎన్నుకున్నాడు. చదునైన కొండమీద 12వ శతాబ్దంలో నిర్మించబడిన ఆ పురాతన కోట పొడవు 2.4 కి.మీ. వెడల్పు 1.6కి.మీ. ఈ కోటకు రాయఘడ్ అని నూతన నామకరణం చేశారు. ఇక్కడే ఛత్రపతి శివాజీకి 1674వ సం॥ జూన్ 6వ తేదీ ఘనంగా పట్టాభిషేకోత్సవం జరిగింది.

శివాజీ పట్టాభిషేకం



ఈ కోటలో శత్రుభేద్యమైన స్థానాలేవో తెలుసుకునే ఉద్దేశంతో.శివాజీ ఒక ప్రకటన చేశాడు. ఎవరి కంటా పడకుండా ఏ వైపు నుంచయినా సరే కోటలోపలికి ప్రవేశించినవారికి గొప్ప బహుమతి ఇస్తామని చాటించాడు. దీనినొక సవాలుగా తీసుకుని మహద్ గ్రామ వాసి అయిన యువకుడొకడు ప్రయత్నించి విజయం సాధించాడు.ఆయువకుడు వచ్చిన మార్గాన్ని వెంటనే పకట్బందీగా మూసివేసి, అక్కడొక ద్వారం ఏర్పాటుచేశారు. దానిని ఇప్పుడు కూడా 'చోర్ దర్వాజా' అని అంటారు. మరొకసారి సమయం దాటిపోయిందన్న కారణంతో కాపలా భటులు కోట తలుపులు మూసివేయడంతో, అక్కడికి పాలు అమ్మడానికి వచ్చిన హిరాకనీ అనే పొరుగూరు స్త్రీ కోటలోనే ఉండి పోవలసివచ్చింది.ఇంటి దగ్గర ఒంటరిగా ఉన్న చంటిబిడ్డను చేరుకోవాలన్న తపనతో. ఆమె అటూ ఇటూ చూసి ఒకవైపు గోడను ఎక్కి, అవతలికిచేరి, చీకట్లో నిటారుగా ఉన్న కొండను దిగి ఇల్లు చేరుకున్నది. ఆమె దిగివెళ్ళిన స్థలంలో శివాజీ ఒక బురుజును నిర్మించి దానికి 'హిరాబుర్జ్' అని పేరు పెట్టాడు.


హిరాకని సాహసం

రాయ్‌ఘడ్ కోటలోనే శివాజీ సమాధి ఉన్నది. ఆ సమాధికి ఎదురుగా ఆయన కుక్క 'వంధ్య' సమాధి కూడా ఉన్నది. అది తన యజమాని చితిలోకి ఉరికిందని చెబుతారు!


రాజ్‌ఘడ్‌కోట


శివాజీ సమాధి



జంజీరాకోట

శివాజీ మళ్ళీ మళ్ళీ ప్రయత్నించినప్పటికీ, తన జీవిత కాలంలో జంజీరా కోటను పట్టుకోలేక పోయాడు. ఒక ద్వీపం మధ్యనున్న ఆ కోటను 1511వ సం॥లో మాలిక్ అంబర్ నిర్మించాడు. పోర్చుగీసులూ, బ్రిటిష్ వాళ్ళూ కూడా ఆ కోటను పట్టుకోలేక పోయారు. శివాజీ కొన్ని జలదుర్గాలు నిర్మించడానికి జంజీరా కోట ప్రేరణ నిచ్చింది. మాల్వాతీరంలో సింధుదుర్గ్‌కోటను నిర్మించడానికి దాదాపు మూడేళ్ళు పట్టింది. కోటి 'హూన్స్' ఖర్చ య్యాయి. నిర్మాణంలో సాయపడడానికి వందమంది పోర్చుగీసు కార్మికులను నియోగించాడు. నౌకా నిర్మాణా నికి ఉపయోగించిన పద్మఘడ్‌ను కూడా ఆయన నిర్మించాడు.

జంజీరాకోటకు నైరుతి దిశగా 56కి.మీ. దూరంలో ఉన్న పాతజలదుర్గాన్ని వశపరచుకుని శివాజీ దానిని పునర్నిర్మించాడు. దానికి సువర్ణదుర్గం అని పేరు పెట్టాడు. ఇక్కడినుంచి ఆయన 'సిద్దీల' కార్యకలాపాలను ఒక కంట కనిపెడుతూ వచ్చాడు.

1680 వ సం॥లో శివాజీ మరణించేనాటికి 240 కోటలు ఆయన అధీనంలో ఉన్నాయి!

సువర్ణదుర్గం కోట



 



# ఇందుమతి నిర్ణయం

భద్రావతీనగరయువరాజైనధర్మపాలుడు,గురుకులంలో విద్యాభ్యాసం ముగించుకుని రాజధానీ నగరానికి తిరిగివచ్చాడు.అతడికి తండ్రి వెంటవుండి రాజనీతీ, రాజ్యపరిపాలనా వ్యవహారాలూ తెలుసుకోవడం కన్న వేటా, కొండ కోనలూ, నదీ తీరాల వెంట తిరుగుతూ ఆనందించడంపై ఎక్కువ మక్కువ. దీనికి తోడు అతడు స్వభావరీత్యా చాలా తొందరపాటు మనిషి.

ధర్మపాలుడికి పరిపాలనా విషయాల్లో ఆసక్తి కలిగించడంఎలాగో తెలియక, రాజు విజయేంద్రుడు విచారపడుతూండేవాడు. ఇలాంటి పరిస్థితుల్లో ఆయన హఠాత్తుగా ఏదో వ్యాధికి గురై మరణించడం జరిగింది. ఈ కారణంగా ఇరవై ఏళ్ళ వయసులో ధర్మపాలుడు భద్రావతీ నగర రాజయ్యాడు.

రాజయ్యాక కూడా ధర్మపాలుడి ప్రవర్తనలో ఏమాత్రం మార్పు రాలేదు.అతడు పూర్వంలాగే ఒంటరిగావేటకువెళుతూండేవాడు.అయినప్పటికీ అనుభవజ్ఞుడైన మంత్రి సుబుద్ధి; నమ్మకస్థుడు, దేశభక్తుడైన సేనాధిపతి వీరవర్మల వల్ల రాజ్యపాలన చాలా సక్రమంగా జరిగిపోతూండేది.

ఒకనాడు ధర్మపాలుడు సూర్యోదయంతోనే బయలుదేరి, అడవిలో చాలాసేపు వేటాడి, మిట్టమధ్యాహ్నం వేళకు బాగా అలసిపోయి, దాహం తీర్చుకునేందుకు ఎక్కడైనా నీరు దొరుకుతుందా అని వెతకసాగాడు. కొంతసేపటికి అతడికి దట్టంగా చెట్లతో క్రిక్కిరిసి వున్న ఒక ప్రాంతాన చిన్న కొలను ఒకటి కనిపించింది.

ధర్మపాలుడు గుర్రందిగి కొలనులో నీరు తాగి దాహం తీర్చుకుని, గుర్రం కూడా నీరు తాగాక, దాన్ని కళ్ళెం పట్టుకుని నడిపిస్తూ, కొలను ఆవలి వైపుకు చూసి ఆశ్చర్యపోయి క్షణకాలం ఆగాడు.

మాచిరాజు కామేశ్వరరావు



మాట రాని దానిలా అలాగే నిలబడి పోయింది.

అంతటి అందగత్తెను చేరువగా చూసిన ధర్మపాలుడు కూడా అచేతనంగా నిలబడి పోయాడు.

ముందుగా ఆమె తేరుకుని, "మిట్టమధ్యాహ్నపుటెండలో వచ్చారు. చల్లని మంచినీళ్ళు తీసుకువస్తాను," అంటూ కుటీరంలోకి వెళ్ళ బోయింది.

ధర్మపాలుడు, అమెను వారిస్తూ, "కొద్ది క్షణాల ముందు కొలనులో దాహం తీర్చుకున్నాను. సరే, ఇంతకూ నువ్వెవరివి? ఈ అడవి మధ్య ఒంటరిగా వుండడం లేదు గదా! నేనెందరో రాకుమార్తెలను చూశాను. కానీఅందంలో వాళ్ళందరూ నీకాలి గోరుకు సరిరారు," అన్నాడు.

ఈ పొగడ్తకు ఆమె తలవంచుకుని చిన్నగానవ్వి, "నేనిక్కడ ఒంటరిగా నివసించడం లేదు. నా బాల్యంలోనే అమ్మ పోయింది. ఐదారు సంవత్సరాల క్రితం, విష సర్పం కాటుకు గురై మా నాన్న మరణించే ముందు నన్ను తన స్నేహితుడికి అప్పగించాడు. నా సంరక్షకుడు వేటగాడు. ఈ కుటీరంలో మేం ఇద్దరం వుంటున్నాం. నాకు వైద్యం తెలుసు. ఈ ప్రాంతాల నివసించే కోయలకు, చెంచులకు అవసరమైన మూలికా వైద్యాలు చేస్తూంటాను. నాపేరు ఇందుమతి," అన్నదామె.

కొలను అవతలి ఒడ్డున ఒక కుటీరం ఉన్నది. దాని ముందు కొన్ని పండ్ల చెట్లూ, రకరకాల పూల మొక్కలూ తీర్చిదిద్దినట్లున్నవి. అడవి మధ్య ఈ కుటీరం ఏమిటా అనుకుంటూ, ధర్మపాలుడు దానికేసి నడిచాడు. అతడు కుటీరాన్ని సమీపించుతున్నంతలో, ఒక చెట్టు కొమ్మకు వేలాడుతున్న పంజరం లోని చిలుకకు అరముగ్గిన జామపండును అందిస్తూ, ఒక అద్భుత సౌందర్యరాశి అతడి కంట బడింది.

"అతిథులకుసుస్వాగతం!"అన్నది రాజును చూసి పంజరంలోని మాటలు నేర్చిన చిలుక.

చిలుక మాటలకు ఆ సౌందర్యరాశి ఉలిక్కిపడి వెనుదిరిగి ధర్మపాలుణ్ణి చూసి, నోట

"నా పేరు ధర్మపాలుడు, ఈ దేశపు రాజును!" అన్నాడు ధర్మపాలుడు, కంఠ స్వరంలో కాస్తంత దర్పాన్ని ధ్వనింపజేస్తూ.

ఆ జవాబు కామె ఏమాత్రం ఆశ్చర్యపోక, "అవును. మిమ్మల్ని చూడగానే అలా అని ఊహించాను. మీ పేరు వినడం తప్ప, మిమ్మల్ని ఇదే ప్రత్యక్షంగా చూడడం," అన్నది.

ధర్మపాలుడు ఏదో అనబోయేంతలో, ఇందుమతి కుటీరం కేసి ఒక అడుగు వేసి, "క్షమించాలి! ఇక్కడి గూడెం నాయకుడు వ్యాధిగ్రస్తుడయ్యాడు. వైద్యం చేస్తున్నాను. సమయమయింది, ఆయన చేత కొన్ని గుళికలు మింగించి రావాలి, వెళతాను," అన్నది.

ఆ వెంటనే ధర్మపాలుడు ఒకడుగు ముందుకువేసి, "ఇందుమతీ! అతిలోక సౌంద ర్యవతివైన నువ్వు, ఇక్కడ అడవిలో అడవి మృగాల మధ్య కోయలతో, చెంచులతో జీవించడం సిగ్గుచేటు. రా, నా వెంటరా! నిన్ను రాజధానికి తీసుకుపోయి నా రాణీని చేసుకుంటాను," అన్నాడు.

దీనికి ఇందుమతి ఒకసారి ధర్మపాలుడి కేసి నిరసనగాచూసి, కుటీరంలోకి వెళ్ళబో యింది. అయితే, ఇంతలో ధర్మపాలుడు వేగంగా ముందుకు పోయి, ఆమెను అడ్డగిస్తూ, "రాజంతవాణ్ణి రమ్మంటుంటే తిరస్కరించ డానికి – నీకెంత ధైర్యం!" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని బలవంతంగా గుర్రం కేసి నడిపించసాగాడు.





ఇందుమతి తన చేతిని ధర్మపాలుడు పట్టు నుంచి విడిపించుకోవడానికి ప్రయత్నిస్తూ, "ఛీ,నన్ను అంటకు!" అంటూ పెద్దగా కేక పెట్టింది.

అయినా, ధర్మపాలుడు తన పట్టువదలక, బలవంతంగా ఆమెను గుర్రం మీద ఎక్కించే సమయంలో, ఎక్కడి నుంచో రివ్వు మంటూ ఒక బాణం దూసుకు వచ్చి, అతడి భుజాన్ని తాకింది.

ఆ మరుక్షణం ధర్మపాలుడు, "అబ్బా!" అంటూ బాధతో అరిచి, ఇందుమతిని వదిలేశాడు. ఇందుమతి బాణం వచ్చిన వైపుకు చూసింది. అల్లంత దూరంలో ఆమె రక్షకుడు, ఒక చెట్టు పక్కన నిలబడి వున్నాడు. అతడి ముఖం కోపంతో ఎర్రబడి వున్నది. కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి.

ఇందుమతి చప్పున తల తిప్పి, ధర్మపాలుడికి చేయి ఆసరా ఇచ్చి కుటీరంలోకి నడిపించుకుపోయింది. అక్కడ అతణ్ణి ఒక మంచం మీద కూర్చోబెట్టి, భుజంలో గుచ్చుకున్న బాణాన్ని లాగి, గాయానికేవో ఆకు పసర్లు పూసి గట్టిగా కట్టు కట్టింది.

ఇంతలో, ఇందుమతి సంరక్షకుడు కుటీరంలోకి వస్తూనే, "ఎక్కడా రాజాధముడు? వాడికెంత అహంకారం!" అంటూ అరిచాడు.

ధర్మపాలుడు తల తిప్పి అతణ్ణి చూసి, "క్షమించు! పెద్ద తప్పు చేశాను. ఈ రోజు నా కళ్ళకేవో పొరలుకమ్మాయి," అన్నాడు.

ఆ జవాబుతో ఇందుమతి సంరక్షకుడు కొంత శాంతపడి, ఆమెకేసి చూశాడు. ఇందుమతి అతణ్ణి బయటకు వెళ్ళమన్నట్టు సైగ చేసింది.

ఆ తర్వాత కొద్దిసేపటికి ధర్మపాలుడు మౌనంగా కుటీరంలో నుంచి బయటికివచ్చి, దాపులనున్న తన అశ్వాన్ని అధిరోహించి నగరానికి వెళ్ళిపోయాడు

ఇది జరిగిన వారం ..లకు, మంత్రి సుబుద్ధి కొన్ని విలువైన కానుకలతో సపరివారంగా ఇందుమతి కుటీరానికి వచ్చి, "అమ్మా! ఇవి మా రాజుగారు నీకు ఇవ్వమన్న కానుకలు. ఆయనది చిన్నతనం నుంచి దుందుడుకుస్వభావం.వారంక్రితంఆయనకారణంగా

ఇక్కడ జరిగిపోయిన దుస్సంఘటనతో, మనిషి స్వభావంలో ఇంతింతనరాని పరివర్తన వచ్చింది. తనుచేసిన తప్పుకు ప్రాయశ్చిత్తంగా, జీవితంలో ఇక ఏనాడూ పెళ్ళిమాట తల పెట్టనని ప్రతిజ్ఞ చేశాడు!" అని చెప్పాడు.

మంత్రి మాటలు వింటూనే ఇందుమతి చలించిపోయి, ఉబికివస్తున్న కన్నీటిని తుడుచుకుంటూ, మంత్రి పక్కనే నిలబడి వున్న సంరక్షకుడితో, "బాబాయ్! శ్రావణ మాసం రాగానే, మహారాజుగారిని ఇక్కడికి వచ్చి నన్ను వివాహమాడి తీసుకువెళ్ళమని చెప్పు!" అని కుటీరంలోకి వెళ్ళిపోయింది.

ఆతర్వాతనెలతిరక్కుండానేధర్మపాలుడితో ఇందుమతి వివాహం అత్యంత వైభవంగా జరిగింది.

ఇది జరిగిన మరుసటి రోజున, భర్తతో సాయంకాలపు వేళ చల్లగాలికి రాజప్రాసాదపు మేడ పైభాగంలో తిరుగుతున్నప్పుడు ఇందుమతి ఉన్నట్టుండి, "మహారాజా! చూశారా, మీ చేత ప్రతిజ్ఞాభంగం చేయించాను," అన్నది చిన్నగా నవ్వుతూ.

ఆ మాటలు అర్థంకాని వాడిలా ధర్మపాలుడు ఒక క్షణం ఇందుమతి కేసి చూసి, చప్పున నవ్వుతూ, "అవునవును, ప్రతిజ్ఞా భంగం చేసిన మాట నిజం! మరి, నీ సంగతేమిటి? ముందు అంతగా తిరస్కరించిన దానివి – ఆ తర్వాత నీకై నువ్వు,నాకు పెళ్ళి రాయబారం ఎందుకు పంపావు?" అని ప్రశ్నించాడు.

"క్షమించండి, మహారాజా! నేను ముందు తిరస్కరించింది మీలో వున్న తొందరపాటుతనాన్ని మితిమించినఅహంకారాన్ని! అయితే, మీరు పంపిన కానుకలతో నా కుటీరానికి వచ్చిన మహామంత్రి చెప్పిన మాటలూ, మీ ప్రతిజ్ఞ సంగతీ విన్న తర్వాత – మీరు నన్ను హృదయపూర్వకంగా ప్రేమించారనీ, మీ స్వభావంలో పూర్తి మార్పు వచ్చిందనీ గ్రహించాను. అందువల్లనే నాకై నేను వివాహ ప్రసక్తి తేవడం జరిగింది," అన్నది ఇందుమతి చిన్నగా నవ్వుతూ.

ఈ జవాబుకు ధర్మపాలుడు ఎంతగానో ఆనందించాడు.





# సందేహనివృత్తి

సౌశీల్యదేశరాజు సర్వోత్తముడు పరిపాలనా దక్షుడేకాక చక్కని కళాపోషకుడు. తన రాజ్యంలోని ప్రతి ఒక్క కళాకారుణ్ణీ ఆదరించడమే కాకుండా, వివిధరంగాలకు చెందిన ఉద్దండులైన కళాకారులను స్వయంగా తన ఆస్థానంలో నిల్పుకుని, కళలపట్ల తన ఆదరణ ఋజువు పరుచుకున్నాడు.

ఒకసారి సర్వోత్తముడు తన పట్టపురాణి నిర్మలాదేవితో కలిసి ఉద్యానవనంలో విహరిస్తున్నాడు. ఆ సమయంలో, ఆస్థానంలో కవి ప్రముఖుడైన సంజీవి అక్కడికి వచ్చాడు. మరి కొద్ది రోజులలో సర్వోత్తముడు ఒక గొప్ప ఉత్సవాన్ని -- సర్వకళా సమ్మేళనం, పేరున జరప తలపెట్టాడు. ప్రతిభగల కళాకారులందరినీఘనంగాసత్కరించాలనిసంకల్పించాడు. ఆ ఏర్పాట్ల విషయమై రాజుతో చర్చించడానికి సంజీవి అక్కడికి రావడం జరిగింది.

వారి సంభాషణ కొంతసేపు శ్రద్ధగావిన్న నిర్మలాదేవి,రాజుతో, "ఈసమ్మేళనం పేరిట మీరు ప్రజాధనందుర్వినియోగం చేస్తున్నారేమోనని, నా అనుమానం. ఎందుకంటే, మనిషికి ముఖ్యంగా అవసరమైనవి ఆహారమూ, అచ్ఛాదన -- అనంతరం తలదాచుకోను ఇంత నీడ. వాటిని ప్రజలకు ఇంకా వీలైనంత సౌకర్యంగా అందేలా చూడండి!" అన్నది.

ఇది విన్న సంజీవి ముఖం వివర్ణమైంది. సర్వోత్తముడికి తలకొట్టేసినట్లయింది. సంజీవి మరేమీ మాట్లాడకుండా వినయంగా రాజు వద్ద శెలవు తీసుకుని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

సర్వోత్తముడు, రాణి వంక ప్రసన్నంగా చూస్తూ, "దేవీ! భగవంతుని కృపవలన మన ప్రజలకు ఏ లోటూ లేదు..." అని ప్రారంభించి, ఆమెకు లలిత కళల విశిష్టత, మనిషికి వాటి ఆవశ్యకత గురించి వివరించ

దాసరి వెంకటరమణ

బోయాడు. ఆ సందర్భంగా వారిద్దరి మధ్యా కొంతసేపు వాగ్వివాదం జరిగింది. చివరకు, మనిషికిగాలీ,నీరూ,ఆహారంతప్పించిమరేమీ అవసరంలేదు – అన్నది మహారాణి వాదన.

"నిజమే! మనిషి బ్రతకడానికి ఆహారం ముఖ్యం. కానీ ఆహారంతో మాత్రమే మనిషి సంతృప్తి చెందలేడు!" అన్నాడు సర్వోత్తముడు.

ఆ సమయంలోఅక్కడికివచ్చి వారి వాద ప్రతివాదనలు విన్న విదూషకుడు ధరహాసు డికి, రాజూ, రాణీ తమ వాదనలలోని సత్యా సత్యాలను వివరించి చెప్పే బాధ్యతను అప్ప గించారు.

ధరహాసుడు ఒకక్షణం ఆలోచించి, అక్క డికి దాపులనే వున్న కాపలా భటుణ్ణి పిలి చాడు. వాడు రాగానే, వాడికి విషయం వివరించి, వాడి అభిప్రాయం అడిగాడు. భటుడు చిరునవ్వు నవ్వి, "మనిషికి తిండే ముఖ్యం.తిండితర్వాతేమిగతావన్నీ," అన్నాడు.

"అలా అనకు. కేవలం ఇంత తిండి మాత్రమే తింటూ, మనిషి బ్రతగ్గలడా? ఆ సంగతి చెప్పు," అన్నాడు ధరహాసుడు.

భటుడు తల గోక్కుంటూ, "ఆఁ, ఎందుకు బ్రతకలేడు, బ్రతకొచ్చు," అన్నాడు.

అప్పుడు ధరహాసుడు, నిర్మలాదేవి కేసి తలతిప్పి, "మహారాణీ! నాకొక పక్షం రోజులు గడువిప్పించండి. ఈ భటుడిచేతే మీ సందేహ నివృత్తి చేయించగలను," అన్నాడు.

రాణి నవ్వి, "సరే,అలాగే కానీ," అన్నది.

ధరహాసుడు, భటుణ్ణి తీసుకుపోయి, ఒక గదిలో బంధించి,వేళకుఆహారం మాత్రమే



అందే ఏర్పాటుచేశాడు. వారం రోజులు గడి చాయి. ధరహాసుడు వాణ్ణి బయటకు పిలి పించి, రాణీ, రాజుల దగ్గరకు తీసుకుపోయి, "ఏరా, ఈ వారం రోజులూ నీకెలా వుంది?" అని భటుణ్ణి ప్రశ్నించాడు.

"అయ్యా! చాలా దుర్భరంగా వుంది. ఏక్షణాన్నయినా, నన్నా గది నుంచి బయటికి పిలిపిస్తారన్న ఆశతో బ్రతికానుకానీ, లేకపోతే ఆత్మహత్యా ప్రయత్నం చేసేవాణ్ణి!" అన్నాడు భటుడు.

ధరహాసుడు, నిర్మలాదేవికి తానా భటుణ్ణి ఏం చేసిందీ చెప్పి, "చూశారా, మహారాణీ! మీరు సెలవిచ్చినట్టు మనిషికి ఆహారం ముఖ్యమే. కానీ కేవలం ఆహారంతోనే మనిషి సుఖంగా జీవించలేడు. మనిషి ప్రాణంతో వుండేందుకు మాత్రమే ఆహారం కావాలి. సంతృప్తికరంగా జీవితం కొనసాగాలంటే ఆనందం, ఆహ్లాదం, ఆలోచన, ఆవేశం..... ఇలా మరెన్నో కావాలి. సృష్టిలో అత్యంత అందమైన ఒకపుష్పాన్ని చూసినప్పుడు మీకెం తోఆనందంగా వుంటుందిగదా? అది మీ కంటికి ఆనందం. లయబద్ధమైన మధురధ్వని మీ చెవి సోకినప్పుడు అహ్లాదంగా వుంటుంది. అది మీచెవికి ఆనందం. ఇలా తమ సర్వేం ద్రియాలనూ సంతృప్తిపరచే అంశాలు, ఈ సృష్టిలో ఎన్నో వున్నవి. అవేవీ లేకుండా బ్రతకడం ఎంత దుర్లభమో క్షణం నిశితంగా ఆలోచించండి. మనిషి జీవించి వుండేందుకు మాత్రమే తినాలి తప్ప,కేవలంతినడం కోసం జీవించకూడదు, అన్న పెద్దల వాక్యం, ఈ సందర్భంగా తమకు గుర్తు చేస్తున్నాను," అన్నాడు.

సర్వోత్తముడు చిన్నగా చప్పట్లు చరిచి, ధరహాసుణ్ణి ప్రశంసిస్తూ రాణివంక ఓరకంటగా చూశాడు. రాణి తనదే పొరబాటన్నట్టు చిరు నవ్వు నవ్వి తల వంచుకున్నది.

సర్వోత్తముడు తృప్తిగా తలాడించి రాణీతో, "అంతా బాగానే వుంది. నీ సందేహ నివృత్తి కోసం ఈ కాపలాభటుడు, పాపం వారం రోజులకఠినఖైదుఅనుభవించాడు!" అన్నాడు.

వెంటనే నిర్మలాదేవి తన మెడలోని రత్న హారం తీసి భటుడికి కానుకగా అందించింది.






ద్రౌపదీస్వయంవరం గురించి విని అనేక దేశాల రాజులు కాంపిల్యనగరానికి వచ్చారు. వారికి వేరువేరు ప్రదేశాలలో విడుదులు ఏర్పాటయ్యాయి. పాండవులు ఒక కుమ్మరి ఇంట బసచేసి, మధుకరం తెచ్చుకుని తింటూ వచ్చారు.

ద్రుపదుడు కూడా తన కుమార్తెను అర్జునుడికిచ్చి చెయ్యాలన్న కోరికను ఎవరికీ తెలుపక, ఎక్కుపెట్టటానికి అసాధ్యమైన విల్లొకటి ఏర్పాటుచేసి, ఆకాశంలో అమర్చిన మత్స్యయంత్రాన్ని ఆ వింటితో కొట్టినవాడికి తన కుమార్తెనిచ్చి పెళ్లి చేస్తానని చాటింపు వేశాడు.

ఈ చాటింపు విని కర్ణుడూ, ధృతరాష్ట్రుడి కొడుకులూ, ఇంకా అనేకమంది రాజులూ, స్వయంవర వేడుకలు చూసే ఉద్దేశంతో అనేకమంది ఋషులూ వచ్చి, ద్రుపదుడి స్వాగతమూ, ఘనమైన ఆతిథ్యమూ స్వీకరించారు.

నగరానికి ఈశాన్య దిక్కుగా స్వయంవర మంటపం నిర్మించి, చక్కగా అలంకరించారు. అక్కడికి క్షత్రియులూ, బ్రాహ్మణులూ వచ్చి, తమకు అనువైన స్థానాలలో కూర్చున్నారు. బ్రాహ్మణులతో కలిసి కూర్చున్నపాండవులు ద్రుపదుడి వైభవాన్ని చూసి ఎంతో సంతోషించారు. అతిథులకు చాలారోజుల పాటు నృత్యగాన వినోదాలతో కాలక్షేపం జరిగింది.

చివరి రోజున ద్రౌపది మంగళస్నానం చేసి, సర్వాభరణాలూ ధరించి, మంచి బట్టలు కట్టుకుని, చేత బంగారు పుష్పాల మాల ధరించి స్వయంవర మంటపం మధ్యకు వచ్చింది.



ద్రుపదుడి పురోహితుడైన సోమకుడు అంతకు ముందే అగ్నిచుట్టూ దర్భలు పరిచి, అగ్ని హెూత్రం చేసి ద్రౌపదిని దీవించాడు. ద్రౌపది రాగానే మంగళ వాద్యాలు మోగాయి.

అప్పుడు ధృష్టద్యుమ్నుడు మండపం మధ్యకు వచ్చి, వాద్యాలను ఆపించి, చుట్టూ కూర్చుని ఉన్న రాజులకు వింటినీ, అయిదు బాణాలనూ, పైన అమర్చిన మత్స్యయంత్రాన్నీ చూపి, "ఈ అయిదు బాణాలనూ ఈ వింటికి ఎక్కుపెట్టి, ఆ మత్స్యయంత్రాన్ని కొట్టినవానిని మా చెల్లెలు పెళ్ళాడుతుంది. కనుక మీలో విలువిద్యా ప్రావీణ్యం గలవారు వచ్చి శక్తి కొద్దీ ప్రయత్నించండి," అన్నాడు. తరవాత అతను ద్రౌపదికి వేరువేరు రాజులను చూపి, వారి పేర్లు చెప్పి, పరిచయం చేశాడు. వారిలో దుర్యోధనాదులతో బాటు శల్యుడూ, విరాటుడూ, శకునీ, అశ్వత్థామా, అక్రూరుడూ, సాంబుడూ, ప్రద్యుమ్నుడూ, కృష్ణుడూ, కృతవర్మా, అనిరుద్ధుడూ, సుశర్మా, శిశుపాలుడూ, చిత్రాంగదుడూ, భగదత్తుడూ, పౌండ్రకవాసుదేవుడూ మొదలైన ప్రముఖులు అనేకులున్నారు.

మన్మథుడి అరవబాణం లాగా ఉన్న ద్రౌపదిని వచ్చినవారంతా తదేక దృష్టితో చూస్తూ ఉండిపోయారు. కృష్ణుడు బ్రాహ్మణుల మధ్యనున్న పాండవులను గుర్తించి బలరాముడికి చెప్పాడు.

మత్స్యయంత్రాన్ని కొట్టే ప్రయత్నం ఆరంభమయింది. ఒక్కొక్క రాజకుమారుడే వచ్చి, వింటిని ఎక్కుపెట్టటం కూడా సాధ్యం కాక, అవమానంతో అవతలికి వెళ్ళిపోసాగారు. అనేక మందికి శృంగభంగమయ్యాక కర్ణుడు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి బాణాన్ని సంధించసాగాడు. ద్రౌపదిని నిశ్చయంగా అతనే గెల్చుకుంటాడని అందరూ అనుకున్నారు. భట్రాజులు కర్ణుడి స్తోత్రాలు ఆరంభించారు. అది విని ద్రౌపది, "నేను సూతుడి కొడుకును వరించను," అని పెద్దగా, అందరికీ వినిపించేలాగా అన్నది. కర్ణుడుచాలా కోపంతోపాటునవ్వుతూ, సూర్యుడికేసి చూసి, తిరిగి వెళ్ళాడు. కర్ణుడి తరవాత శిశుపాలుడూ, జరాసంధుడూ, శల్యుడూ వింటిని సంధించలేక విఫలులయ్యారు.



అర్జునుడు వింటిని సమీపించి, సభకు నమస్కారం చేసి, వింటికి నమస్కరించి, తన గురువుకు ఆత్మనమస్కారం చేసి, కృష్ణుణ్ణి తలుచుకుని, తాను రోజూ వాడే వింటిని సంధించినంత సునాయాసంగా ఆ వింటికి అయిదు బాణాలూ సంధించి, మత్స్యయంత్రాన్ని ఒక్కదెబ్బతో కింద పడగొట్టాడు. అందరూ ఒక్క క్షణం దిగ్భ్రమ చెందారు. తరవాత హర్షనాదాలు మిన్నుముట్టాయి. బ్రాహ్మణులు సంతోషంతో పై బట్టలు ఎగరవేశారు. ఆ క్షణంలోనే ధర్మరాజు నకుల సహదేవులను తీసుకుని తమ విడిదికి వెళ్ళిపోయాడు. ద్రుపదుడు మాత్రం సంతోషాశ్చర్యాలతో దూరం నుంచి అర్జునుణ్ణి చూస్తూ ఉండిపోయాడు.

ఇక రాజులెవరూ ముందుకు రాలేదు. ప్రేక్షకులలో కలకలం సాగింది. ఆ సమయంలో బ్రాహ్మణుల మధ్యనుంచి అర్జునుడు లేచి వచ్చి, వింటిని సమీపించాడు. అదిచూసి బ్రాహ్మణులు ఆశ్చర్యపోయి, "మహా పరాక్రమవంతులైన శల్యుడూ, జరాసంధుడూ, శిశుపాలుడూ లాటివాళ్ళకు అలవిగాని విల్లును ఈ బ్రాహ్మణ కుమారుడు పట్టుకోబోతున్నాడు గదా. వీడు నిశ్చయంగా బ్రాహ్మణులకు అవమానం తెస్తాడు!" అని తమలో తాము అనుకున్నారు. కొందరు మాత్రం, "వీడికి బలం, అస్త్ర విద్యానైపుణ్యం ఉండేఉంటుంది. లేకపోతే ఆ వింటి జోలికి ఎందుకు పోతాడు?" అనుకున్నారు.

స్వయంవరానికి వచ్చిన రాజులకు గొప్ప అవమానం జరిగినట్టు తోచింది. "ఈ ద్రుపదుడు మనని చెట్టెక్కించి, పండు కోసుకునే లోపల కిందికి తోసేశాడు. తన కూతుర్ని ఒక్క రాజకుమారుడికీ ఇవ్వక బ్రాహ్మణుడికిస్తాడా? బ్రాహ్మణుల్లో ఎక్కడన్నా స్వయంవరం ఉన్నదా? ఈ పిల్ల బ్రాహ్మణుణ్ణి ఎలా చేసుకుంటుంది? ఇలాటి పని మరోసారి జరగకుండా ఈ ద్రుపదుడి ప్రాణాలు తీయాలి! ఈ పిల్లఎవరోఒకరాజకుమారుణ్ణివరిస్తుందా సరేసరి, లేకపోతే దీన్ని నిప్పులోకి తొయ్యాలిసిందే. బ్రాహ్మణుడు గనక ఈ వటువును ప్రాణాలతో వదిలేద్దాం," అంటూ రాజులు కత్తులూ, కటార్లూ చేతబట్టి, ద్రుపదుణ్ణి

చుట్టుముట్టారు. ద్రుపదుడు భయపడి బ్రాహ్మణుల మధ్యకు వెళ్ళాడు.

ద్రుపదుడిపై కత్తికట్టిన రాజులకు భీమార్జునులు అడ్డు తగిలారు. రాజులు బాణాలు వెయ్యటం మొదలుపెడితే భీముడొక చెట్టు పెకలించి తెచ్చి, రాజుల బాణాలను దానితో అడ్డుతూ అర్జునుడి పక్కన నిలబడ్డాడు. బ్రాహ్మణులు ద్రుపదుణ్ణి కాపాడటానికి రాజుల మీద రాళ్ళు విసరసాగారు. అర్జునుడు వారిని వారించి, మత్స్యయంత్రాన్ని కొట్టిన వింటితోనే రాజులను ఎదుర్కొన్నాడు. శల్యుడు, కర్ణుడు మొదలైనవారు ఇది చూసి, తమను ఎదిరించినవాడు బ్రాహ్మణుడే అయినా చంపదగిన వాడేనని నిశ్చయించారు. అర్జునుడు కర్ణుడికి ఎదురై యుద్ధం చేశాడు. అర్జునుడి ప్రతాపానికి ఆశ్చర్యపడి కర్ణుడు, "ఓ బ్రాహ్మణుడా, నీ అస్త్ర కౌశలానికి మెచ్చాను. నాతో సమంగా పోరాడగలవాడు అర్జునుడు తప్ప మరెవరూ లేరు. నువ్వు నిజంగా ఎవరివో చెప్పు," అన్నాడు. కాని అర్జునుడు తానెవరైనదీ బయట పెట్టలేదు. బ్రహ్మతేజస్సు జయించరానిదనుకుని కర్ణుడు యుద్ధం మానేశాడు.

ఈలోపల శల్యుడికీ భీముడికీ యుద్ధం సాగుతున్నది. చివరకు భీముడు శల్యుణ్ణి పట్టి ఎత్తి, చంపే ఉద్దేశం లేక దూరంగా విసిరి వేశాడు. బ్రాహ్మణులందరూ గొల్లున నవ్వారు. మిగిలిన రాజకుమారులకు కాళ్ళూ, చేతులూ ఆడలేదు.



అయితే, ఈ మహావీరులు మామూలు బ్రాహ్మణులు కారని అందరికీ స్పష్టమయింది. వాళ్ళు ఎవరో తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా జాస్తి అయింది. కృష్ణుడు కూడా రాజులతో, "ఈ బ్రాహ్మణులు న్యాయంగా ద్రౌపదిని గెలుచుకున్నారు. రాజులతో ధర్మయుద్ధం చేశారు. అందుచేత వారిపై కయ్యానికి కాలు దువ్వకండి," అన్నాడు. అతని సలహా పాటించి రాజులు ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు.

ఈలోపల కుమ్మరి ఇంట బస చేసి ఉన్న కుంతి, తన కొడుకులు ఎంతకూ తిరిగి రాక పోయేసరికి, దుర్యోధనాదుల వల్ల వాళ్లకు ఏమి కీడు మూడిందో అని భయపడింది. ఇంతలో నకుల సహదేవులతో ధర్మరాజు



ధర్మమార్గమేదో ఆలోచించి అలా చెయ్యండి," అన్నది.

ధర్మరాజు కొంచెంసేపు ఆలోచించి, కుంతిని విచారించవద్దని, అర్జునుడితో, "అర్జునా, నువ్వీ కన్యను అగ్నిసాక్షిగా వివాహం చేసుకో," అన్నాడు.

దానికి అర్జునుడు, "అది ఎలా సాధ్యమవుతుంది? నాకు అన్నలైన నువ్వూ, భీముడూ వివాహం చేసుకోకుండా నేనెలా చేసుకుంటాను?" అన్నాడు.

తల్లి అన్న మాటలూ, అర్జునుడు చెప్పిన మాటా విని కొంతసేపు ఆలోచించి, ధర్మరాజు, "మనమందరమూ ఈ కన్యను పెళ్ళాడదాం," అన్నాడు.

ఇంతలో కృష్ణుడు బలరాముడితో సహా పాండవులున్న బస వెతుక్కుంటూ వచ్చాడు. అతను తనకూ, కుంతీదేవికీ మొక్కటం చూసి ధర్మరాజు, "కృష్ణా, మేము బ్రాహ్మణ వేషాలు ధరించి అజ్ఞాతంగా బతుకుతున్నాం కదా, మమ్మల్ని ఎలా గుర్తుపట్టావు? ఇక్కడికి ఎలా వచ్చావు?" అని అడిగాడు.

కృష్ణుడు నవ్వి, "రాజా, అగ్నిని ఎలా దాస్తావు? ఇవాళ స్వయంవరంలో ప్రదర్శించిన పరాక్రమం పాండవులకు తప్ప మరొకరికి సాధ్యమా? దుర్మార్గుడయిన దుర్యోధనుడి తంత్రం పారకపోవటం మంచిదయింది. మీరు ఎవరికీ తెలియరాకుండా ఉండటమే మీకు మంచిది," అని పాండవులవద్ద సెలవు

వచ్చాడు. తరవాత కొంతసేపటికి భీమార్జునులు ద్రౌపదితో సహా వచ్చి చేరారు. వస్తూనే వాళ్ళు, "అమ్మా, మేము భిక్ష తెచ్చాం," అన్నారు లోపల ఉన్న తల్లితో. కుంతీదేవి, "అందరూ సమంగా పంచుకోండి, నాయనా!" అంటూ ఇవతలికి వచ్చి, దేదీప్యమానంగా వెలిగిపోతున్న ద్రౌపదిని చూసి బిత్తరపోయింది.

ఆమె ధర్మరాజుతో, "నాయనా, నావల్ల పెద్ద పొరపాటు జరిగిపోయింది. భీమార్జునులు భిక్ష తెచ్చామంటే, అందరూ సమంగా పంచుకోమని అనేశాను. నేనెన్నడూ అసత్యమాడినదాన్ని కాను. ఈ కన్యను మీరందరూ స్వీకరిస్తే అది అధర్మమవుతుంది; స్వీకరించకపోతే నా మాట అబద్ధమవుతుంది. అందుచేత

తీసుకుని, బలరాముడితో సహా వెళ్ళిపో యాడు.

ఈలోపల ధృష్టద్యుమ్నుడొక పని చేశాడు. మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని గెలుచుకున్న బ్రాహ్మణుడెవరో తెలియదు. అతను ఎక్కడ విడిది చేశాడో, ద్రౌపదిని ఎక్కడికి తీసుకు పోతాడో తెలియదు.

అందుచేత ధృష్టద్యుమ్నుడు మిగిలిన బ్రాహ్మణుల వెంట గోప్యంగా బయలుదేరి, అర్జునుడివెంటకుమ్మరిఇంటికివచ్చి, ఎవరూ గమనించకుండా ఒకచోట దాక్కున్నాడు.

కృష్ణబలరాములు వెళ్ళిపోయాక భీమార్జున నకుల సహదేవులు వెళ్ళి, మధుకరాన్నం తెచ్చారు. అందులో కొంత బలులకూ, అతి థులకూ ఉంచి, మిగిలినది సరిగ్గా రెండు భాగాలు చేసి, ఒక భాగం భీముడికీ, మిగిలి నది మిగతా నలుగురికీ పంచి పెట్టమని ద్రౌపదికి కుంతి చెప్పింది. ద్రౌపది అలాగే చేసింది.

భోజనాలు అయ్యాక సహదేవుడు దర్భలు పరిచాడు. దానిమీద జింకచర్మాలు పరిచి అందరూ పడుకున్నారు. పాండవుల కాళ్ళ దగ్గిర ద్రౌపది పడుకున్నది.

అప్పుడు పాండవులు యుద్ధ వ్యూహ భేదనోపాయాలను గురించీ, వివిధ అస్త్రాల ప్రయోగోపసంహారాలను గురించీ మాట్లాడు కుంటూ, కొంత వితర్కించుకున్నారు. ఇదంతా చాటున ఉండి విన్న ధృష్టద్యుమ్నుడు, వీళ్ళు బ్రాహ్మణ వేషాలు ధరించిన క్షత్రియులేనని రూఢి చేసుకుని ఇంటికి తిరిగివెళ్ళి తండ్రితో చెప్పాడు.

"మన కృష్ణను వెంటబెట్టుకుని వెళ్ళినది ఇద్దరేగాని, వాళ్లుండే చోట మరో ముగ్గురు అన్నదమ్ములున్నారు. వాళ్ళ తల్లి ఉన్నది. వాళ్ళు క్షత్రియులనటానికి సందేహమేమీ లేదు. వాళ్ళు పాండవులేనని నా అనుమానం," అన్నాడు ధృష్టద్యుమ్నుడు ద్రుపదుడితో.

ఈ మాట విని ద్రుపదుడు తన కోరిక తీరిందని ఎంతగానో సంతోషించాడు. వాళ్ళ నుగురించి మరింత వివరంగా తెలుసుకు రమ్మని ఆయన ఆప్తుడైన తన పురోహితుణ్ణి పంపాడు.



# పిసినారితర్కం

రాజపాలెం గ్రామంలో కనకయ్య అనే ఒక వడ్డీ వ్యాపారి వుండేవాడు. ఆయన వడ్డీలకు చక్రవడ్డీలుకట్టి ధనం ఆర్జించాడు. సాటివాళ్ళు ఆయన వినేటట్టూ, ఇతరులు చాటుమాటుగా ఆయన్ని పిసినారి కనకయ్య అనేవాళ్ళు. కానీ ఆయన వాళ్ళ మాటలకు ఏమాత్రం కోపం తెచ్చుకోకుండా, "లేనివాడు పిసినారి అయ్యే అవకాశమేలేదు! ఉన్నవాడిలో అంతో ఇంతో పిసినారితనం ఉండడం అవలక్షణమే కాకపోగా, అది అవసరం కూడా. అందువల్లనే అలాంటివాడు, డబ్బవసరంలో వున్న వాళ్ళకు, వడ్డీకి డబ్బు సర్దుబాటు చేసి సాయపడగలుగుతున్నాడు," అనేవాడు.

ఒకనాడు కనకయ్య పొలం నుంచి ఇంటికి పోతూ, దారి పక్కన చెప్పులుకుట్టి అమ్మే నారన్న దుకాణం కేసి వెళ్ళాడు. నారన్న చెప్పుల బేరం తగిలిందనుకుని, ఒకజత చెప్పులు ఆయనకు చూపుతూ, "బాబయ్యా! మంచి పదును చేసిన చర్మంతో కుట్టిన చెప్పులు. బస్తీలో అయితే ఇరవైరూపాయలకు తక్కువ ఇవ్వరు. నేను పది రూపాయలకే అమ్ముతున్నాను, తీసుకోండి!" అన్నాడు.

కనకయ్య చెప్పుల కేసి చీదరించుకుంటున్నట్టు చూసి, "ఒరే, అరిగిపోని పాదాలకు అరిగిపోయే చెప్పులెందుకు? నేనిక్కడికి వచ్చింది చెప్పుల కోసం కాదు. దారిలో ఎదురు పడ్డ స్నేహితుడొకడు చుట్ట ఇచ్చాడు. వాడి దగ్గర అగ్గిపెట్టె నిండుకుంది. నువ్వు చుట్టలు కాలుస్తుండడం చూశాను. ఏదీ, అగ్గిపెట్టె ఇటివ్వు!" అన్నాడు.

— చోడవరపు సత్యప్రకాశరావు



చందమామ అనుబంధం - 81

మనదేశపు చెట్లు :

# వరగోగు

చిత్తడి నేలలలోనూ, నదీ తీరాలలోనూ పొదల మధ్య కనిపించే వరగోగు చెట్టు చాలా అందంగా పూస్తుంది. ఆ పువ్వును "రాణి పువ్వు" అని అంటారు. స్వీడిష్ వృక్ష శాస్త్రజ్ఞుడు మాగ్నస్ వి. లాజెర్ స్ట్రామ్ దీనిని ఫ్లాస్–రెజీనే (రాణి పుష్పం) అని వర్ణించాడు. ఆయన పేరు మీదుగానే ఈ చెట్టును వృక్షశాస్త్రంలో లాజెర్ స్ట్రోమియా ఫ్లాస్ రెజీనే అని అంటారు. ఈ పువ్వులు చాలా ఆకర్షణీయంగా ఉంటాయి. మొగ్గగా ఉన్నప్పుడూ, పూచినప్పుడూ లేత గులాబీ రంగులో కనిపించే పువ్వులు, రాలిపోయేప్పుడు తెల్లగా ఉంటాయి. ఇవి పెద్ద గుత్తులు గుత్తులుగా పూస్తాయి. పూరేకులు మడతలు పడిఉంటాయి.ఇవి యేడాదికి రెండుసార్లుఅంటే ఏప్రిల్ - మే నెలలలోనూ,జూలై - ఆగస్టు నెలలలోనూ పూస్తాయి. ఆచెట్ల ఆకులు పైభాగంలో ముదురు పచ్చరంగులోనూ,అడుగుభాగంలో లేతపచ్చ రంగులోనూ ఉంటాయి. ఆకు అడుగున ఈనెలు ఒత్తుగా ఉంటాయి. ఏప్రిల్ - మే నెలలలో చిగురిస్తాయి. కాయలు పచ్చగానూ, పండిన తర్వాత నల్లగానూఉంటాయి. ఈపళ్ళు తొందరగా రాలిపోకుండా చాలాకాలం చెట్లకు అంటి పెట్టుకుని ఉంటాయి.



టేకు కలపకు తరవాత వరగోగు కలపే దృఢమైనదని చెబుతారు. దీనిని పడవల నిర్మాణానికీ, బళ్ళ నిర్మాణానికీ ఉపయోగిస్తారు. నీళ్ళకు తట్టుకుని దృఢంగా దీర్ఘకాలం నిలబడే శక్తి ఉన్నది కాబట్టి ఓడ రేవులలో స్తంభాలకు వీటిని ఎక్కువగా ఉపయోగిస్తారు. దేశ విదేశాల లోని ఓడ రేవులలోఈకలపను ఎక్కువగా ఉపయోగించడం వల్ల, ఈకలప లభించే మనదేశానికి మంచి పేరున్నది.

ఈ చెట్టును హిందీలో జారుల్ అనీ, బెంగాలీలో అజార్ అనీ, మరాఠీలో టామాన్ అనీ,ఒరియాలో పటోలీ అనీ, తమిళంలో కడలి అనీ, మలయాళంలో ఆటంపూ అనీ, కన్నడంలో చల్లా అనీ అంటారు.

మనదేశపు ఋషులు - 5

# మార్కండేయుడు



హిమాలయ ప్రాంతంలో నివసించిన మృకండుడనే మునికి చాలాకాలం సంతానం కలగలేదు. ఆయన పుత్రుణ్ణి కోరి శివుణ్ణి ప్రార్థించాడు. ఆయన ధ్యానంలో ఉండగా పరమశివుడు ప్రత్యక్షమై, "పదహారేళ్ళు మాత్రమే జీవించే వివేకవంతుడయిన కుమారుడు కావాలా? లేక చిరాయువు కలిగిన తెలివిలేని పుత్రుడు కావాలా?" అని అడిగాడు.

విద్యావివేకాల పట్ల గౌరవం కలవాడు కావడం చేత మృకండుడు, వివేకవంతుడయిన కుమారుడే కావాలని కోరాడు.

ఆయన కోరిన ప్రకారం కొడుకు పుట్టాడు. మార్కండేయుడని పేరు పెట్టారు. మార్కండేయుడికి పదేళ్లు నిండే నాటికి దూర ప్రాంతాల నుంచి, పండితులూ, జిజ్ఞాసువులూ సందేహాలు తీర్చుకోవడానికి ఆయన దగ్గరికి వచ్చేవారు. పన్నెండేళ్ళ నాటికే ఆయన మంచి గురువుగానూ, నిష్ఠాగరిష్ఠుడైన మునిగానూ పేరు తెచ్చుకున్నాడు.

అయితే ఆయన పెరిగి పెద్దవుతున్న కొద్దీ, తల్లిదండ్రులు విచారగ్రస్తులు కాసాగారు. అయినా వాళ్ళు తమ విచార కారణాన్ని తనయుడికి తెలియజేయలేదు. మార్కండేయుడు పదహారవ యేట అడుగు పెడుతున్నప్పుడు వాళ్ళు కళ్ళనీళ్ళు ఆపుకోలేక పోయారు. ఇది మార్కండేయుడికి అమితాశ్చర్యం కలిగించింది. కారణం అడిగాడు. అప్పుడు వారికి ఆయన ఆయువు త్వరలో మూడనున్నదన్న విషయం చెప్పక తప్పలేదు. అయితే, తల్లిదండ్రులు తమ ఆయువును త్యాగం చేసినట్టయితే మార్కండేయుడు చిరాయువు కాగలడు!

మార్కండేయుడు చల్లని మాటలతో తల్లిదండ్రులను ఓదార్చాడు. ఆ తరవాత నిర్జన ప్రాంతానికి వెళ్ళి, శివధ్యానంలో కూర్చున్నాడు. ఆయన ఆయువు తీరి మరణకాలం ఆసన్నం కాగానే యమభటులు వచ్చారు. కాని ఆయనచుట్టూ మిరమిట్లుగొలిపే తేజస్సు

కారణంగా సమీపించలేక తిరిగి వెళ్ళారు. ఆ తరవాత యమధర్మరాజే వచ్చి, మార్కం డేయుడి మీదికి పాశాన్ని విసిరాడు. యమపాశం, మార్కండేయుడు కౌగిలించు కుని ఉన్న శివలింగానికి తగులుకున్నది. ఆ క్షణమే శివలింగం నుంచి శివుడు అగ్ర హావేశంతో ప్రత్యక్షం కాగానే యముడు మర ణించాడు. ఆ కారణంగానే శివుడికి మృత్యుం జయుడనే పేరు వచ్చింది.

తరవాత శివుడు శాంతించడం వల్ల, యముడు పునర్జీవితుడయ్యాడు. ఆవేళకు మార్కండేయుడి మరణఘడియలు కాస్తా దాటిపోయాయి. ఎప్పుడూ పదహారేళ్ళ వయసు వాడిగానే ఉండేలాగా శివుడు ఆయనకు వరమిచ్చాడు. ఆవిధంగా ఆయన యుగాలు మారినా మరణించని చిరంజీవి అయ్యాడు!

ఈ పురాణ కథలో కొన్ని అంతరార్థాలు కూడా ఉన్నాయి. మార్కండేయుడు తన ప్రత్యే కతను, వ్యక్తిత్వాన్ని త్యజించి – శాశ్వతమైన వాడూ, మరణించవాడూ అయిన భగ వంతుడిలో లీనమయ్యాడు. అందువల్ల కాలం ఆసన్నమయినప్పటికీ ఆయన మర ణించలేదు. అంతశ్చేతనంలో కాలాతీతు డయ్యాడు గనకే, ఆయన ఎప్పుడూ పద హారేళ్ళు దాటని వాడయ్యాడు. ఆయనకు భూత, భవిష్యత్, వర్తమానాలు లేవు. ఉన్నది అనంతకాలం ఒక్కటే. ఇదొక గొప్ప ఆధ్యా త్మిక అనుభూతి!



# మీకు తెలుసా?

1. బుద్ధుడు తన మతప్రచారాన్ని ఎక్కడ ప్రారంభించాడో తెలుసా?
2. హిట్లర్ 1938వ సం॥లో కలుపుకుని 1945వ సం॥లో వదిలిపెట్టిన దేశం ఏదో మీకు తెలుసా?
3. నేలమీద పాకే జంతువులలో అతి పెద్దది ఏది?
4. 'అర్జున అవార్డు' అందుకున్న మొట్టమొదటి భారతీయ క్రికెట్ క్రీడాకారుడు ఎవరు?
5. ఘానా పూర్వనామం ఏమిటి?
6. కలకత్తాను ఎవరు స్థాపించారు?
7. సాధారణంగా ఏనుగు ఎంతకాలం జీవిస్తుంది?
8. ఈజిప్టులో అధికసంఖ్యాకులు మాట్లాడే భాష ఏది?
9. అబిసీనియా ఇప్పటి పేరేమిటి?
10. 'కవులకుకవిగా' ప్రసిద్ధిగాంచిన ఆంగ్లకవి ఎవరు?
11. ఇటలీలో చెలామణిలో వున్న కరెన్సీ ఏది?
12. మన పురాణాలలో ఐరావతమనే ఏనుగు ఎవరి వాహనం?
13. ప్రప్రథమంగా అంతరిక్షంలో నడిచిన వారెవరు?
14. అతి ఎత్తయిన భూచరజంతువు ఏది?
15. పార్శీల పవిత్రగ్రంథం ఏది?
16. "ఏంజెల్ ఫాల్స్' జలపాతం ఏదేశంలో ఉన్నది?
17. వాటర్లూలో నెపోలియన్‌ను ఓడించిన వారెవరు?
18. పాకిస్తాన్ మొట్టమొదటి అధ్యక్షుడు ఎవరు?
19. కెనడాలో అత్యంత పొడవైన నది ఏది?

## సమాధానాలు

1. వారణాసి సమీపంలోని సారనాథ్‌లో.
2. ఆస్ట్రియా.
3. మొసలి.
4. సలీం దురాని (1961).
5. గోల్డ్ కోస్ట్.
6. జాబ్ చార్నాక్.
7. 70 - 80 సం॥
8. అరబ్బీ భాష.
9. ఎథియోపియా.
10. ఎడ్మండ్ స్పెన్సర్ (1552-1599)
11. లీరా.
12. ఇంద్రుడు.
13. అలెక్సీ లియొనొవ్ (1965).
14. జిరాఫీ.
15. జెండ్ అవెస్తా.
16. వెనిజులా.
17. ఆర్థర్ వెల్లెస్లీ.
18. మహమ్మదాలీజిన్నా.
19. మెకెన్జీ.




సీతాపతి ఒక్కగానొక్క కూతురు అరుణ చక్కనిచుక్క. సుగుణవంతురాలు. పొరుగూరి వీరభద్రుడు, అరుణను తన కొడుకు జయంతుడికి చేసుకుంటానని కబురు చేశాడు. ఆయనెలాంటివాడో, స్థితిగతులేమిటో తెలుసుకుందామని సీతాపతి ఆ ఊరు వెళ్ళాడు.

వీరభద్రుడు ఆస్తిపాస్తులు ఉన్నవాడు. బాగా చదువుకున్నాడు. మర్యాదస్థుడు. ఆయన సీతాపతికి సకల మర్యాదలూ చేసి, "మీ కుమార్తె అరుణ గురించి తెలిసిన వాళ్ళందరూ ఎంతో గొప్పగా చెప్పారు. అలాంటి పిల్లే నా ఇంటి కోడలు కావాలని నా కోరిక. నాకు కట్నకానుకలేమీ వద్దు. పెళ్ళి కూడా ఘనంగా చేయనవసరం లేదు. శాస్త్రోక్తంగా పెళ్ళి జరిపించి, మీ అమ్మాయిని మా ఇంటికిపంపండి చాలు," అని చెప్పాడు.

జయంతుడు చూడ ముచ్చటగా ఉన్నాడు. పెద్దలంటే వాడికి వినయముంది. ఈ సంబంధం అన్నివిధాలా బాగుంటుందని సీతాపతి ఎంతో సంతోషించి తిరిగి వెళ్ళి, తనవారందరికీ ఈ విషయం చెప్పాడు. ఇంటిల్లిపాదీ సంతోషించారు.

అలాంటి సమయంలో కాంతయ్య అనేవాడు, సీతాపతి దగ్గరకు పిడుగులాంటి వార్త మోసుకుని వచ్చాడు. వీరభద్రుడు ఎవరితోనో మాట్లాడుతూ, "సీతాపతిది దరిద్రపు కుటుంబం. అరుణ ఆ ఇంట తప్పబుట్టింది. ఆ పిల్లను ఆ ఇంటి నుంచి తప్పించాలనే, నేనీ సంబంధాన్ని కట్నం లేకుండా ఒప్పుకున్నాను. ఎవరైనా బిచ్చగాళ్ళ సొమ్ము తీసుకుంటారా? అందుకే ఇస్తామన్నా వాళ్ళనుంచి పైసా కూడా కట్నంగా తీసుకోను," అన్నాడట.

పైగా ఇంతటితో ఊరుకోక, సీతాపతి కుటుంబం గురించి ఇంకేదేదో హేళనగా మాట్లాడాడట.

"వసుంధర"



కాంతయ్య చెప్పింది వింటూనే, సీతాపతి మండిపడి, ఆ సంబంధం వదులుకుంటా నన్నాడు. అప్పుడు సీతాపతి తండ్రి రఘుపతి కలుగజేసుకుని, "వీరభద్రుడు నీతో ఎంతో మర్యాదగా వ్యవహరించాడు. అడిగి మరీ పిల్లను చేసుకుంటానన్నాడు. అలాంటివాడిలా మాట్లాడాడంటే అందుకేదో కారణముం టుంది. వాళ్ళూ వీళ్ళూ చెప్పింది నమ్మడం కంటే, నువ్వు స్వయంగా వెళ్ళి వీరభద్రుణ్ణి కలుసుకుని మాట్లాడటం మంచిది," అని సలహా ఇచ్చాడు.

మొదట ఆ సలహా సీతాపతికి నచ్చలేదు. కానీ కాసేపు శాంతించాక తండ్రి చెప్పింది సబబుగా వుందనిపించింది. తను విన్నది కనక నిజమేఅయితే మాత్రం వీరభద్రుణ్ణి నానా మాటలూ అనాలనుకుని పొరుగూరుకు బయల్దేరాడు సీతాపతి.

దారిలో సీతాపతికి రైతు ఒకడు కనిపిం చాడు. ఆ రైతు తన పొలంలో కొంత వీర భద్రుడికి చవగ్గా అమ్మాడు. ఆ పొలంఎం దుకూ పనికిరానిదనీ, రైతుకు తను దానమిచ్చి నట్లే అయిందనీ వీరభద్రుడు అంటున్నాడని తెలిసి సంజాయిషీ అడగడానికి బయల్దేరాడు రైతు.

"నేనూ అలాంటి పనిమీదే బయల్దేరాను. ఒకరికొకరం తోడుగా వుండడం మంచిది," అన్నాడు సీతాపతి సంతోషంగా.

వాళ్ళిద్దరూ మరికొంత దూరం వెళ్ళేసరికి, దారిపక్కన వ్యాపారి ఒకడు తన గుర్రబ్బండిని మరమ్మతు చేయిస్తున్నాడు. ఒకప్పుడాయన దీనదశలో వుంటే, వీరభద్రుడు వెయ్యి వరహాలు అప్పిచ్చాడట. ఆ డబ్బుతో పట్నం వెళ్ళి వ్యాపారం ప్రారంభించి బాగా పైకి వచ్చాడు వ్యాపారి. ఆ తర్వాత వీరభద్రుడికి బాకీ తీర్చడమే కాక, ఏటా విలువైన కానుకలు పంపుతున్నాడట. ఒకసారి వీరభద్రుడు పట్నం వస్తే ఎంతో ఘనంగా సత్కరించి పంపాడట. కానీ వీరభద్రుడు, వ్యాపారిని కృతఘ్నుడనీ, ఒక్కమారు కూడా గ్రామం వచ్చి తనను చూడ లేదనీ అంటున్నాడట. సంజాయిషీ అడిగేం దుకు వ్యాపారి, వీరభద్రుడి ఊరుకు వెళు తున్నాడు.

సీతాపతి, రైతు కూడా అలాంటి పనిమీదనే బయల్దేరారని తెలిశాక వ్యాపారి, "నా బండి మరమ్మతుకు ఎంతోసేపు పట్టదు. మనమంద రంకలిసి బండిలోనే వెళదాం," అన్నాడు.

కాసేపటికి వ్యాపారి గుర్రబ్బండి ప్రయాణా నికి సిద్ధమయింది. ముగ్గురూ అందులో ఎక్కి కొంత దూరం ప్రయాణం చేశాక, వాళ్ళకు కవి ఒకడు తటస్థపడ్డాడు. వీరభద్రుడు ఆయ నను ఒక జమీందారుకు పరిచయం చేస్తే, ఆ కవికి డబ్బూ, కీర్తి రెండూ వచ్చాయట. తనమీద కావ్యం రాయలేదని వీరభద్రుడా కవిని అందరివద్దా దుయ్యబడుతున్నాడట.

కవి వాళ్ళకు ఈ సంగతి చెప్పి, "ఆరం భంలో ఒకసారి ఆయనమీద పద్యం చెప్పాను. అది విని ఆయన, 'నేను సామాన్యుణ్ణి. ఇలాంటి కవిత్వానికి అర్హుణ్ణి కాను' అంటూ అభ్యంతరపెట్టాడు. ఇప్పుడేమో ఇలాగంటు న్నాడు. ఉన్న మాట మొహం మీదనడం, నా అలవాటు. కావాలంటే, కావ్యం రాయమని నన్నడిగితే కాదంటానా? అప్పుడలాగని ఇప్పుడిలాగనడం నాకు నచ్చలేదు. అందుకే సంజాయిషీ అడగడానికి బయల్దేరాను," అన్నాడు.

ఆయన కూడా వాళ్ళతో పాటు బండె క్కాడు.

బండి వీరభద్రుడి ఇల్లు చేరుకునేసరికి సాయంకాలమయింది. ఆ సమయంలో వీర భద్రుడు ఇంటి అరుగు మీద కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్నాడు. బండిలోంచి దిగిన నలుగుర్నీ చూసి ఆయన ఎంతో ఆప్యా





యంగా, "ఒక్కసారిగా ఇంతమంది ఆత్మీయులు నా ఇంటికి రావడం ఎంతో సంతోషంగా వుంది!" అంటూ లోపలికి ఆహ్వానించి, వారి అవసరాలు చూడవలసిందిగా పనివాళ్ళకు పురమాయించాడు. ఆయన ముఖంలోని నిష్కల్మషమైన అభిమానాన్ని చూసి, ఆ వచ్చిన నలుగురూ వెంటనే ఏమీ అనలేకపోయారు. అయితే, వారి మనసుల్లో వీరభద్రుడి పట్ల శత్రుభావం వుండడం వల్ల లోపలికి వెళ్ళలేక తటపటాయిస్తూ అక్కడే నిలబడ్డారు.

అంతలో వీరభద్రుడింటి అరుగు మీద వున్న మనిషి, "అయ్యా! నా సంగతి మీరు తేల్చి చెప్పలేదు," అన్నాడు.

"ఇందులో తేల్చి చెప్పడానికేముంది? ఒకసారి మాటిచ్చానంటే దానికి తిరుగుండదు. అదీ నా విషయం," అన్నాడు వీరభద్రుడు.

అప్పుడా మనిషి అరుగు మీదినుంచి కిందికి దిగి, సీతాపతివాళ్ళకు దగ్గరగా వెళ్ళి, "అయ్యా! మీరందరూ ఈయనకు ఆత్మీయులే అయితే, నా విషయం నచ్చజెప్పి పుణ్యం కట్టుకోండి," అన్నాడు.

విషయమేమిటా అని వాళ్ళు కుతూహలపడితే, ఆ మనిషి తన కథనిలా చెప్పాడు:

ఆ ఊళ్ళో వీరభద్రుడికింకో పెంకుటిల్లుంది. ఆరంభంలో ఆయన ఆ పెంకుటింట్లోనే వుండేవాడు. సంపద పెరిగాక ఆయన ఇప్పుడున్న పెద్దింట్లోకి మారిపోయాడు. చాలా కాలం ఆ పెంకుటింటిని శుభకార్యాలకు వచ్చిన బంధువులు విడిది చేయడానికి వాడుతూండేవాడు. అయితే ఆ ఇంటికి వాడకం తక్కువై పాడుబడిపోతున్నది. సూరయ్య అనే పేద రైతు తనకా ఇల్లు కావాలని అడిగాడు. వీరభద్రుడా ఇంటిని కారుచవగ్గా సూరయ్యకు అమ్మడానికి ఒప్పుకున్నాడు. సూరయ్య డబ్బు ఏర్పాట్లు చేసుకుంటున్నాడు.

ఆ మనిషి పేరు వీరయ్య. వీరయ్య, సూరయ్య అదృష్టాన్నీ, వీరభద్రుడి మంచితనాన్నీ పొగిడాడు. అది విని సూరయ్య తిరస్కారంగా, "ఆ ఇల్లొక దయ్యాలకొంప. ఊరికే ఇస్తానన్నా ఎవరూ తీసుకోరు. నేను డబ్బిచ్చి తీసుకుంటున్నాను. ఇందులో ఆయన మంచి

తనం లేదు, నా అదృష్టం లేదు. అదృష్టం ఆయనది. అవసరం నాది. అంతే!" అన్నాడట.

ఇప్పుడు వీరయ్య ఆ మాటలు వీరభద్రుడికి చేరవేసి – అలాంటి కృతఘ్నుడికి ఇల్లు ఇవ్వవద్దనీ, తనకిస్తే చర్మం చెప్పులు కుట్టించిచ్చి ఋణం తీర్చుకుంటాననీ అంటున్నాడు. కానీ వీరభద్రుడు ఎంత చెప్పినా మాట తప్పనంటున్నాడు.

సీతాపతీ అతడివెంట వచ్చినవాళ్ళూ ఏదయినా అనేలోగా, వీరభద్రుడు తనే కలగజేసుకుని, "సందర్భాన్నిబట్టి ఎదటలేని మనిషి గురించి అవాకులూ, చవాకులూ అనడం జరుగుతుంది. అలాంటలవాటు నాకూ వుంది. అందుకే నేను చాటుమాటు మాటలకు ప్రాధాన్యమివ్వను. ఎదురుగా ఏమంటే అదే నాకు ముఖ్యం. చాటుమాటలు కొందరు పనిగట్టుకుని పుట్టిస్తారు. ఒక్కొక్కసారి నిజమూ వుంటుంది. వాటిని పట్టించుకోకపోవడం నా పద్ధతి. నా ఆత్మీయులు నా పద్ధతిని హర్షిస్తారే తప్ప, ఏమాత్రం నీకు అనుకూలంగా చెప్పరు. కాబట్టి నువ్వింక వెళ్ళు!" అని వీరయ్యను పంపేశాడు.

ఈ మాటలు వింటూనే సీతాపతీ, వెంట వచ్చినవాళ్ళూ తెల్లబోయారు. అంతవరకూ వాళ్ళు వీరభద్రుడి గురించే తప్ప తమ గురించి ఆలోచించలేదు. ఆయన చాటు మాటలు పట్టించుకోడు. తాము మాత్రమెందుకు పట్టించుకోవాలి?

సీతాపతీవాళ్ళు తమకు అవసరమైన పనులున్నవంటూ వీరభద్రుడికి చెప్పి, వెంటనే తిరుగు ప్రయాణమయ్యారు. అంత అవసరం అయిన పనులున్నవాళ్ళు – పనిగట్టుకుని తన ఇంటికెందుకొచ్చారో వెంటనే ఎందుకు వెళ్ళిపోతున్నారో అర్థం కాక, వీరభద్రుడు ఆశ్చర్యపోయాడు.

అయితే సీతాపతీ, అతడి వెంట వీరభద్రుడి సంజాయిషీకోసం వచ్చినవాళ్ళు మాత్రం– వీరభద్రుడి వంటి వాడి స్నేహం, బంధుత్వం తమను సంస్కరించగలంతటి గొప్పవన్న సంతోషంతో ఉత్సాహంగా తిరుగు ప్రయాణం చేశారు.





# హడావుడిమనిషి

ఒక గ్రామంలో రామయ్య అనే పౌరోహిత్యపు బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన వట్టి హడావుడిమనిషి. ప్రతి చిన్న విషయానికీ హడావుడి చేస్తూండేవాడు.

పొరుగు గ్రామంలో ఒక పెళ్ళి ముహూర్తం వచ్చింది. పౌరోహిత్యానికి రామయ్యను పిలిచారు. ఆయన ఎంతో ఆనంద పడిపోయాడు. హడావుడి మనిషి కావటంచేత రామయ్య కోడి కూయక ముందే లేచి, పక్క గ్రామానికి బయలుదేరుతూ తన భార్యతో, "ఒసే, నేను బయలుదేరుతున్నాను. తలుపు వేసుకో. దొంగలు రావచ్చు, జాగ్రత్త!" అని ఒకటికి రెండు సార్లు అన్నాడు.

రామయ్య భార్య లేచి, తలుపు వేసి వచ్చి మళ్ళీ పడుకున్నది.

ఇదంతా ఇంటి దాపులనే దాగి ఉన్న దొంగలు గమనించారు. వాళ్ళకు తెల్లవార్లూ ఏదీ దొరకలేదు. రామయ్య వెళ్ళిపోయాడు. ఇక ఇంట్లో ఆయన భార్య తప్ప ఇంకెవరూ లేరు. ఇంకా ఝాము రాత్రి మిగిలి ఉన్నది. రామయ్య ఇంటికి కన్నం వేస్తే ఇంకేమీ దొరక్కపోయినా బియ్యమైనా దొరుకుతాయి.

ఆమాట అనుకుని దొంగలు రామయ్య ఇంటికి కన్నం వేసి లోపల ప్రవేశించారు. లోపల దీపం కూడా లేదు. కటిక చీకటి. అదీ మంచిదే, తమ పంట పండిందనుకున్నారు దొంగలు.

ఇంతలోనే రామయ్య వెనక్కు వచ్చి, హడావుడిగా తలుపు తట్టి భార్యను పిలిచాడు. భార్య మళ్ళీ తలుపు తీసింది.

"తలగుడ్డ మరిచిపోయాను," అని రామయ్య తలగుడ్డ తీసుకుని మళ్ళీ బయలుదేరాడు.

రామయ్య భార్య తలుపు గడియ పెట్టి వచ్చి మళ్ళీ పడుకున్నది. ఆమెకు కాస్త కునుకు పట్టటానికి వ్యవధి ఇచ్చి, దొంగలు చీకట్లో

బియ్యం బాన ఎక్కడ ఉన్నదీ తడివి చూసి, దాని పక్కనే ఒక గుడ్డ పరిచారు. బియ్యం అందులో పోసుకుని తీసుకుపోదామని వాళ్ళ ఉద్దేశం.

ఇంతలో రామయ్య మళ్ళీ హడావుడిగా వెనక్కు వచ్చి, తలుపు తట్టుతూ భార్యను పిలిచాడు.

భార్య వెళ్ళి తలుపు తీసి, "ఈసారి ఏం మరిచారు?" అన్నది.

"సంచీ! సంచీ మరిచాను. కాస్త వెళ్ళి తీసుకురా!" అన్నాడు రామయ్య.

రామయ్య భార్య బియ్యపు బాన పక్కగానే వెళ్ళి ఒంకె నున్న సంచీ తీసుకుని వచ్చి భర్త కిచ్చి, తలుపు మూసింది.

సంచీ కోసం ఆమె వెళ్ళేటప్పుడు దొంగలు దూరంగా తప్పుకుని నక్కవలసి వచ్చింది. ఆమె కాలికి గుడ్డ తగలటమూ, దాన్ని ఆమె వంగి తీసుకుని వెళ్ళి కప్పుకుని పడుకోవ టమూ వాళ్ళు ఎరగరు.

ఆమెకు కాస్త కునుకు పట్టటానికి వ్యవధి ఇచ్చి, దొంగలు బానలో నుంచి బియ్యం ఎత్తి, లోగడ గుడ్డ పరిచి ఉండవలసిన చోట పోశారు. బాన దాదాపు ఖాళీ అయింది. బియ్యం మూట కట్టటానికి గుడ్డ చెంగుల కోసం నేల మీద ఎంతసేపు తడివినా అవి దొరకలేదు. తాము నేల మీద బియ్యం పోసిన సంగతి వాళ్ళకు తెలిసివచ్చింది.

ఇప్పుడేం చేయాలా అని వాళ్ళు అనుకుం టూండగా, హడావుడి రామయ్య మూడోసారి తిరిగివచ్చి, తలుపు తట్టాడు.

భార్య వెళ్ళి తలుపు తీసి, "అప్పుడే తెల్లారి పోయిందే! ఇక నేను పనులు ప్రారంభించవచ్చు," అన్నది.

ఈ మాటలు విని దొంగలు హడలిపోయి కన్నంలో నుంచి జారుకున్నారు. ఆ తొందరలో వాళ్ళు తమ వెంట ఉన్న డబ్బు సంచీ రామయ్య ఇంటనే వదిలేసిపోయారు.

రామయ్య ఈసారి తాను తీసుకుపోవలసిన వస్తువులన్నీ, ఒక్కటీ వదలకుండా శ్రద్ధగా తీసుకుని, సకాలానికే పొరుగూరు చేరాడు. ఆయన హడావుడి ఆయనకు తెలియకుం డానే ఈసారికి ఎంతో లాభించింది.



Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!





It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to t what you've learnt everyday, when y come home from school !

THE
HANDAMAMA
OLLECTION

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Mahantesh C. Morabad



Mahantesh C. Morabad

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కొందరి బతుకు విధానం! రెండవ ఫోటో : కొందరికి చూడ వినోదం!

పంపినవారు : పి. వేంకటరత్నమ్మ W/o. పి. బుచ్చిబాబు, ఎల్ఐజి 20 - ఏపిహెచ్‌బి కాలనీ సత్రంపాడు పోస్టు, ఏలూరు. ప.గో. జిల్లా (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.